ధనము పొదుపు కొరకు

# "ఉమా"

22. క్యారట్లు బంగారు రేకు కవరింగు నగలనే కొనండి.

అనేక సంవత్సరములు మన్నికగా యుండును.



















బొత్తాములు - ఒకటి రు. 1/- కఫ్సు-బొత్తాములు జత రు. 2/-

నెం. 203 - జత గాజులు — 2¼ సైజు జత రు. 14/40;

నెం. 705/2 జూకాలు - జత రు. 6/-;

నెం. 37 చెవిపోగులు జత రు. 2/-.

## ఉమా గోల్డు కవరింగు వర్క్సు
### H.O. ఉమా మహల్.. మచిలీపట్టణము. ఇండియా

ప్రొప్రయిటర్: టి. వి. సుబ్బయ్య

## మా విక్రయ శాలలు

90, చైనాబజారు రోడ్డు, మద్రాసు-1

శివాలయం వీధి, విజయవాడ

104, కామధేను బిల్డింగు, అవెన్యూ రోడ్డు, బెంగుళూరు సిటీ

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటోశీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.




హాయి గొలిపే పరిశుభ్రంగా వుండండి! లైఫ్‌బాయ్‌తో
స్నానంవల్ల ఉత్సాహంతో ఉప్పొంగి పొండి! జ్ఞాపక
ముంచుకోండి, స్నానం చేయునప్పుడు లైఫ్‌బాయ్ మురికిలో
గల క్రిములను కడిగివేయును — ఎంతో ఆరోగ్యవంత
మైన హాయి గొలుపును! ఔను, లైఫ్‌బాయ్‌తో
కుటుంబంలో అందరి జీవితం ఆరోగ్యవంతం.

**ఎక్కడ లైఫ్‌బాయ్ వున్నదో అక్కడ ఆరోగ్యము వున్నది!**

L.33-X29 TL

హిందుస్తాన్ లీవర్ ఉత్పత్తి

# వాటర్‌బరీస్

ఎర్ర లేబులు

# కాంపౌండు

దగ్గులకూ రొంపలకు దీనిని




## ఎంచుకొనడానికిగల నాలుగు కారణాలు

| | | | |
|---|---|---|---|
| **1** వాటర్ బరీస్ కాంపౌండు దగ్గులనూ, రొంపలనూ సత్వరం, ఫలప్రదంగా నిర్మూలిస్తుంది. | **2** వాటర్ బరీస్ కాంపౌండు లోగల క్రియోసోట్స్, గయోకాల్ అనేవి, ఊపిరితిత్తులను శుభ్రం చేయడంలో సాయపడతాయి. | **3** వాటర్ బరీస్ కాంపౌండు కేవలం మందే కాదు, ఒక అద్భుతమైన టానిక్ కూడా. శరీరానికి వ్యాధి నిరోధక శక్తి సమకూర్చడంలో సాయపడుతుంది. | **4** వాటర్ బరీస్ కాంపౌండు ఆకలిని పెంచుతుంది. జీర్ణ శక్తిని వృద్ధిచేస్తుంది. రక్తాన్ని శక్తివంతం చేస్తుంది. వృధాఅయిన లవణాలను తిరిగిసమకూరుస్తుంది |

# వాటర్‌బరీస్ కాంపౌండు

**ఎర్ర లేబిలు**

వార్నర్—లాంబర్ట్ ఫార్మాసుటికల్ కంపెనీ ( మితబాధ్యతలతో యు.ఎస్.ఎ.లో స్థాపించబడింది )

# పాఠకుల లేఖలు

## జూలై 1962

సంతోష వార్త! "పరోపకారి పాపన్న" కథ చాలా బాగున్నది. "రాకాసి లోయ" చాలా అద్భుతంగా ఉంది. వీటన్నిటికంటె నన్ను మొదట ఆకర్షించినది వడ్డాది పాపయ్యగారి అట్టమీది బొమ్మ.

—దక్షిణామూర్తి గజ్జల, వరంగల్లు

కథలన్నియు ముచ్చటగా నున్నవి. జూన్ నెల "చందమామ" చాలా ఆకర్షణీయముగా నున్నది. "దుష్టుడికి ఆతిథ్యం", "నౌకరు యుక్తి", "ఏడాది కొక అబద్ధం" చాలా మనోరంజక ముగా నున్నవి.

—పి. పుష్పవల్లి, నౌపడా

గుండు భీమన్న కథలు ముగించగనే నాకు పట్టిన విచారమునకు బదులుగా పరోపకారి పాపన్న కథలు నన్ను మళ్ళీ సంతోష పెట్ట గలిగినవి. "చందమామ"కు నా కృతజ్ఞతాభి వందనములు.

—కె. షరీఫ్ మియ్యా, ద్రోణాచలము

ప్రతి నెల "చందమామ" చాలా ఆకర్ష ణీయంగా ఉంటున్నది. పిల్లలకు, పెద్దలకు ఎంతో ఆనందం కలిగిస్తున్నందుకు చాలా సంతోష ముగా ఉన్నది.

—కె. హెచ్. నాగరత్నం, బొడ్డపాడు

"ఏడాది కొక అబద్ధం", "పాపన్న చదువు", "నౌకరు యుక్తి", ఎంతో బాగా యున్నవి. "రాకాసి లోయ" సీరియల్ చాలా బాగుంది.

—చండూరి లక్ష్మీసుగుణ, ఖమ్మం

ఈ నెల "చందమామ" చాలా బాగున్నది. ముఖ్యంగా "దుష్టుడికి ఆతిథ్యం", "సత్యవాది" అమోఘం.

—పి. రమేష్ చందర్, జనగాం

అన్ని కథలలోకి "నౌకరు యుక్తి" చాలా బాగుంది. పరోపకారి పాపన్న గుండు భీమన్నకు తినికట్టుగా యున్నది. "దుష్టుడికి ఆతిథ్యం" ఏమియు బాగా లేదు. "రాకాసి లోయ" ఎంత పొడిగిస్తే అంత బాగుంటుంది.

—డి. సూర్యనారాయణ, అమలాపురం

యుక్తిపరుడు బీర్బల్ కథలు ఇంత త్వరితముగా ముగించినందుకు మాకెంతో విచారముగా ఉంది. నాకు ఊహ వచ్చిన దగ్గరనుంచి "చందమామ"లో బొమ్మలు చూస్తూ, చదవటం నేర్చుకొన్నాక దీనిలోని కథలు చదువుచున్నాను.

—నామన ధనలక్ష్మి, పాయకరావుపేట

జన్మదినోత్సవ సందర్భంగా "చందమామ"కు నా ప్రత్యేక శుభాభివందనములు.

—వి. శ్రీనివాసరావు, మద్రాసు

"నౌకరు యుక్తి" అను కథ చాలా బాగుంది. రచయితకు నా అభివందనములు.

—పొన్నాడ సత్యవంతరావు, విశాఖపట్నం

'సత్యవాది' అపరాధ పరిశోధనా, "నౌకరు యుక్తి" చాల స్వభావ సిద్ధముగా నున్నవి. ఉత్పలవారి కలం "పార్వతీ కల్యాణ" రచనలో ఉరకలు వేసింది. అన్నింటికి మిన్న "రామాయణ" కథలో శంకర్‌గారి చిత్రాలు "చందమామ"కు మెరుగు తెచ్చాయి.

—సత్తి వెంకటరెడ్డి, బి.ఇ., కాకినాడ

"ప్రపంచపు వింతలు" విద్యార్థులకు "ఆల్బం"కు చాల ఉపయోగపడుతున్నాయి. ఇందుకు నా అభినందనలు.

—తా. వెం. నరసింహమూర్తి, మ్యోర్త




ఇంతటి తెలుపుదనాన్ని ముందు ఎన్నడూ చూడలా
టినోపాల్ తెల్ల బట్టలను ఎంత తెల్లగా చేస్తుంది అంటే, మీ దుప్పట్లు, గలేబులూ, చేతిరుమాళ్లూ నిజంగా మిరుమిట్లు గొలుపుతాయి. మీ తెల్ల చీరెలూ, ధోతీలు, షర్టులు, పేంట్లు అదనపు తెలుపుదనంతో మెరుస్తాయి.

మీరు డబ్బును కూడా పొదుపుచేసుకోవచ్చు
మీ బట్టలను తెల్లగా చేసుకోవాలంటే మీరు ఎంతో డబ్బు ఖర్చు పెట్టనక్కర్లా. మామూలుగా సబ్బుతో ఉతికి వాటిని టినోపాల్ కలిపిన నీటిలో వేయండి. టినోపాల్ ఎంత పొదుపు అయినదంటే ఒక డార్జీడు బట్టలకు టీ చెమ్చాలో నాలుగోవంతు చాలు. అంతేకాదు ఒక సారి టినోపాలులో వేస్తే ప్రతిసారీ వేయనక్కర్లేదు. టినోపాలు తెల్లదనం బట్టలను సులభంగా వదలదు.

గుర్తుంచుకొనండి — కొంచెము **టినోపాల్** తెల్లని దుస్తులను అన్నిటికన్న తెల్లగా చేయును

T&L — SISTA'S SG 170 B

'ఆయనను మెప్పించుట అంత సులభంకాదు...'



బొంబాయి 16, మహీమ్ లో రి 8, యూనియన్ హౌస్ యందున్న శ్రీమతి. ఆర్.ఆర్. ప్రభు ఇలా చెప్పుచున్నది; 'ఆయనకేదీ మెప్పులేదు. ఇంక బట్టల సందర్భంలోనా...!' ఇప్పుడు ఆయన బట్టలన్నిటినీ సన్‌లైట్‌తో ఉతుకుతున్నాను...' ఆయనకూ, నాకూ పరమానందం! సన్‌లైట్ సమృద్ధిగా నురగ నిస్తుంది, ఉతికే పని నాకెంతో సులభం! 'నేను ఉతికేవన్నీ తెల్లగాను, కాంతిగాను ... పరిశుభ్రంగా వుంటాయి! నాకు సన్‌లైట్ తప్ప మరేదీ నచ్చదు!'

# సన్‌లైట్




మీ బట్టలకు వరప్రసాదం!

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

S.30-X29 TL



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యగారి "పార్వతీ కళ్యాణము" గేయ కథ ఈ సంచికతో ముగుస్తున్నది. దక్షయజ్ఞంతో ప్రారంభమైన పరమశివుడి కథ కుమార సంభవంతో పూర్తి కావటం సమంజసంగా ఉంటుంది. వచ్చే సంచికలో "కుమారసంభవము" ప్రారంభిస్తాము.

ఖలీఫా కథల శ్రేణికి చెందిన మరొక పెద్ద కథ "అన్నా-చెల్లెలు" ఈ సంచికలో ప్రారంభ మవుతున్నది. దీనిని మూడు సంచికలలో ప్రకటిస్తున్నాము.

గుండు భీమన్న కథలను అభిమానంతో చదివిన పాఠకులు పరోపకారి పాపన్నను కూడా ఆదరించటం విశేషం. కిందటి నెలలో చదువు పూర్తిచేసిన పాపన్న ఈ నెల రాజసన్మానం పొందుతాడు.

సంపుటి : 31 జూలై 1962 సంచిక : 1

Sankar



# భారత చరిత్ర



దేశాంతరాల నుంచి వచ్చి భారతదేశంలో రాజ్యాలు ఏర్పరచుకుని సామ్రాజ్యాలు కూడా ఏలిన విదేశీయులు శకులు, పహ్లవులు, యవనులు మొదలైన వారికి మొదటి దెబ్బ దక్షిణ దేశంలో తగిలింది. సాతవాహన వంశంవాడైన గౌతమీపుత్ర శాతకర్ణి ఈ విదేశీయుల పరిపాలనను దక్షిణాన లేకుండా చేసేశాడు. అయినా వీరి ఏలుబడి ఉత్తరదేశంలో మరికొంత కాలం నిర్విఘ్నంగా సాగింది. వాసుదేవ కుషానుడి అనంతరం కుషానుల ప్రభ తరిగిపోయినప్పటికీ పూర్తిగా నశించలేదు. క్రీ.శ. మూడవ శతాబ్దం నాటికి కూడా వీరి ఏలుబడి కింద నాలుగు రాజ్యాలున్నాయట. కాని గుప్త సామ్రాజ్యం ఏర్పడటంతో విదేశీయుల ప్రభ నశించి పోయింది.

మొదటి చంద్రగుప్తుడితో గుప్తరాజుల ఉచ్చదశ క్రీ.శ. 320 లో ప్రారంభమయింది. చంద్రగుప్తుడు "మహా రాజాధి రాజ" బిరుదం ధరించాడు. బీహారులో మహాశక్తిమంతులుగా ఉండిన లిచ్ఛవీ రాజ వంశంవారి ఆడ బడుచును కుమారదేవిని వివాహ మాడి తన బలాన్ని పెంపొందించుకున్నాడు. అతని హయాంలో గుప్త సామ్రాజ్యంలో అలహాబాద్, అయోధ్య, దక్షిణ బీహరు ప్రాంతాలు కలిశాయి.

గుప్త రాజులలో ప్రముఖుడన దగిన వాడు సముద్రగుప్తుడు. ఇతను 320 తరువాత ఎప్పుడో రాజ్యానికి వచ్చి 380 కి ముందుగానే చనిపోయాడు. ఇతను బహుముఖ ప్రజ్ఞాశాలి, కవి, పండితుడు, గాయకుడు. ఇతడి ఆస్థానంలో ఎందరో కవి పండిత ప్రకాండులుండేవారు. వారిలో హరిషేణుడు గొప్ప కవీ, గొప్ప యోధుడూ కూడా. ఇతని విజయాలు దక్షిణాన కంచివరకూ విస్తరించి నప్పటికీ గుప్త సామ్రాజ్యం.

## 10. గుప్త సామ్రాజ్యం

నర్మదా, మహా నదీల వద్ద ఆగిపోయింది. గంగా యమునా లోయప్రాంతమూ, తూర్పు మాల్వా, బహుశా బెంగాలులోని కొన్ని జిల్లాలూ గుప్త సామ్రాజ్యంలోవే. ఈయన ప్రభావం సామ్రాజ్యపు ఎల్లలు దాటి చాలా దూరం వెళ్ళింది. తూర్పు బంగాళం, అసాము, నేపాలు, గర్వాల్, జలంధర్, పంజాబు రాజులూ, పశ్చిమ భారతానికి చెందిన మాళవులూ, యౌధేయులూ, మద్రకులూ, అభిరులూ, సనాకానీకులూ, కుషాను వంశపు రాజ సంతతివారూ, శకులూ, సింహళ రాజులూ—అసంఖ్యాకులు ఆయన అధికృతకు లోబడి సామంతులై, కప్పాలు కట్టారు. ఈ విధంగా దిగ్విజయం చేసిన అనంతరం ఆయన అశ్వమేధయాగం చేశాడు.

సముద్రగుప్తుడి తరవాత రెండవ చంద్రగుప్తుడు రాజయాడు. ఈయనకు విక్రమాదిత్యుడనే బిరుదున్నది. ఇతను ఇంచుమించు క్రీ. శ. 380 నుంచి 413 వరకూ పరిపాలించాడు. ఇతనుకూడా తన సామ్రాజ్యాన్ని విస్తరించుకున్నాడు. ఇందుకుగాను ఇతను యుద్ధాలు చేయుటమేగాక, వీలయినప్పుడు సామోపాయం కూడా ప్రయోగించాడు. ఇతర రాజ వంశ స్త్రీలను పెళ్లాడి



తన బలం వృద్ధిచేసుకున్నాడు. కుబేరనాగ అనే రాజ పుత్రికను పెళ్ళాడి నాగ వంశీయులతోనూ, రుద్రసేను డనేవాడికి తన కుమార్తెను ప్రభావతి నిచ్చి దక్కనులోని వాకాటకులతోనూ మైత్రి చేసుకున్నాడు. పశ్చిమ మాల్వా, కఠియువాడులలో శకుల పరిపాలన అంతం చేస్తానని మాట ఇచ్చి సనాకానీకుల నాయకుణ్ణి సామంతుణ్ణి చేసుకున్నాడు. ఇతను శకులను ఓడించిన విషయం ఇతని నాణాలపైనా, బాణుడి "హర్ష చరితం" లోనూ మనకు తెలుస్తుంది.

ఈ చంద్రగుప్తుడి నాణాలపైన "విక్రమాదిత్య" అనీ "సాహసాంక" అనీ, "శకారి"

అనీ వున్నది. విక్రమాదిత్యుణ్ణి గురించిన కల్పిత గాథ లెన్నోవున్నాయి. ఆ గాథలలో ఇతని ఆస్థానంలో నవరత్నా లుండేవారని వున్నది. మిగిలినవారిమాట ఏమైనా కాళిదాసు చంద్రగుప్త విక్రమాదిత్యుడి సమకాలికు డనటానికి ఆధారం వున్నది.

చంద్రగుప్త విక్రమాదిత్యుడి అనంతరం మొదటి కుమారగుప్తుడూ, అతని అనంతరం స్కందగుప్తుడూ రాజ్యం చేశారు. కుమారగుప్తుడికి మహేంద్రాదిత్యుడనే పేరుండేది. ఇతను 415 - 455 మధ్యకాలంలో రాజ్యం చేశాడు. ఇతని కాలంలో గుప్త సామ్రాజ్యం హిమాలయాల నుండి నర్మదదాకా, ఉత్తర బంగాళం నుంచి కతియవాడ్ దాకా 'విస్తరించి ఉండేది. ఇతని అఖరు దినాలలో నర్మదా లోయలోని పుష్యమిత్రు లనేవారు బలవంతులై చిక్కులు తెచ్చిపెట్టారు. అయితే స్కందగుప్తుడు వీరిని అణచిపెట్టాడు. కాని అతనికి హూణుల పోరు తటస్థ పడింది. స్కందగుప్తుడు వారి తొలి దాడులను ఎదిరించి జయించాడు. ఈ విజయం "కథా సరిత్సాగరం"లో చెప్పబడి ఉంది. స్కందగుప్తుడి పరిపాలన క్రీ. శ. 467 ప్రాంతంలో ముగిసింది.

తరువాత చరిత్రలో మనకు ఎందరో గుప్తవంశపు రాజులు కనిపిస్తారు. వీరిలో కొందరు హూణులతో పోరి జయించి ప్రసిద్ధికెక్కారు. వీరిలో బాలాదిత్యు డనేవాడూ, యశోధర్ము డనేవారూ ఉన్నారు. 5, 6, 7 శతాబ్దులలోకూడా దేశంలోని వివిధ ప్రాంతాలలో గుప్త రాజులు తమ ప్రతిభను ప్రదర్శించారు. 7 వ శతాబ్దం ఉత్తరార్థంలో ఆదిత్యసేను డనేవాడు గుప్తవంశపు ఖ్యాతిని పునరుద్ధరించి, గొప్ప బిరుదులు తగిలించుకున్నాడు. అయితే 8 వ శతాబ్దంలో కనౌజ్, గౌడదేశపు రాజుల మధ్య సంఘర్షణలో మగధ నలిగిపోయింది. అంతటితో గుప్త సామ్రాజ్యం అస్తమించింది.





# పార్వతీ కల్యాణము

సప్తమాశ్వాసము :

తపము మాని గిరి కుమారి
తండ్రి యొద్ద కరుదెంచెను ;
సఖుల వలన హిమవంతుడు
సకల మెఱిగి హర్షించెను.

గౌరిని తలయంటి చెలులు
కైసేసిరి, అప్పుడామె
కసటువోవ కడుగబడిన
పసిడి బొమ్మలాగుండెను !

శివుడు రజత గిరికి నేగి,
చిత్తంబున సప్త ఋషుల
తలచినంత నటకు వారు
తక్షణ మరుదెంచినారు.

"నీలకంఠ ! నిను మదిలో
నిలిపిన వారలు పుణ్యులు,
నీ మదిలో మము నిలిపితి,
మే మెంతటి పుణ్యులమో !

ఇప్పటికే మిన్నందిన
గొప్పతనము పడసినాము,
నీ పనుపున నింతకంటె
పైపై వెలుగొందగలము !

దేవా ! మము తలచిన పని
తెలిపి మాకు ననతిమ్ము,"
అని యరుంధతీ వసిష్ఠు
లపుడు మ్రొక్కి పలికినారు.

"ఓ మునీశులార ! మీరు
నా మనసెఱిగిన వారలు ;
గిరిరాజకుమారిని నే
పరిణయ మాడగ తలచితి.

అలస్యము చేయకింక
అమరుల కోరిక తీర్చెద ;
తారకు నోడించునట్టి
దళవాయిని సమకూర్చెద.

---

ఉత్పల సత్యనారాయణాచార్య

హిమవంతుని కడకు నేగి
ఈ నా కోరిక తెల్పుడు,"
అని శివుడానతి యొసగిన
మునులెల్లరు ముదమొందిరి.

వెనువెంటనె మునులు లేచి
వినువీథికి ఎగసినారు;
దిగ్గున హిమవంతు నోష
ధిప్రస్థము చేరినారు.

భక్తితోడ హిమవంతుడు
పరమ ఋషుల పూజించెను;
ఆదరమున వారిని తన
అంతిపురికి గొనిపోయెను.

"ఓ మహామునులార! దయతో
తాము వచ్చిన పని వచింపుడు,"
అని హిమాలయరాజు మ్రొక్కుచు
అడిగినంత వసిష్ఠుడిట్లనె.

"అద్రిరాజ! మహేశు నానతి
హైమవతి నా దేవదేవుని
కడుగ వచ్చితి మిటకు; భువి నీ
వపరిమిత పుణ్యుండవైతివి!"

అని వసిష్ఠుడు పలుక గిరిపతి,
"ఆర్యులార! మహాప్రసాదము,"
అనుచు పులకిత దేహుడై తన
వెనుక నిల్చిన ఉమను చూచెను.

సిగ్గుతో ఉమ చేత నుండిన
చెంగలువ పువురేకు లెంచుచు,
తల్లి నొకపరి చూచి, చిర్నగ
వుల్లసిల తన మోము వంచెను.

మేనకయు సుముహూర్త మెపుడని
మిగుల సంతోషమున అడిగెను;
మునులు నేటికి నాలుగవ నా
డని ముదంబున బదులు పల్కిరి.



అద్రిరాజు ఉమా కుమారిని
అందఱకు మ్రొక్కింప, నామెను
గగన మును లాశీర్వదించిరి,
కౌగిలించె అరుంధతీ సతి.

అద్రిరాజును వీడుకొని మును
లరుగుదెంచిరి సంభ్రమంబున,
శివుని కీ శుభ వర్తమానము
చెప్పి పెండ్లికి సిద్ధపఱచిరి.

దివ్య విమానములందు పితామహ
దేవేంద్రాదులు, రంభోర్వశులును
కైలాసమునకు కౌతూహలమున
వేలకు వేలుగ వచ్చిరి పెండ్లికి.

గగన మునీంద్రులు గంధము పూయగ,
గంగాయమునలు వింజామరలిడ,
శారద నేర్పుగ శృంగారింపగ,
శచి పరమేశుని కద్దము చూపెను.

పెండ్లి కుమారుని చేసి మహేశుని
భృంగిశునిపై కూర్చొన బెట్టిరి;
గళమున గంటలు గణగణ మ్రోయగ
ఖంగున కదలెను భృంగీశుండును.

ప్రమథ గణంబులు భేరీ ఢమరుక
తుముల మృదంగ ధ్వానములందున
ధింతక ధింతక ధిం ధిం తక యని
గంతులు వైచుచు కదల దొడంగిరి.

కాహళు లొక్కట ఊదెడు వారలు,
సాహెూ నాదము చేసెడు వారలు,
జాజరి గీతులు పాడెడు వారలు,
ఝుల్లరి ఝుల్లరి మోదెడు వారలు.

హిమవంతుని పుర గోపురమందున
ఎసగెను మంగళ తూర్యరవంబులు;
పెండ్లి మండపమునందు బజంత్రులు
పెల్లుగ నూదిరి నాగసారంబులు.

పసుపు కుంకుముల పళ్ళెములం గొని
పడతులు వేడుకతో నరుదేరగ,
హిమవంతుడు సహధర్మిణి తోడుత
ఈశు నెదుర్కొని తోడ్కొని వచ్చెను.

బంగరు కలశము గైకొని మేనక
వంగి జలంబులు వోయగ, గిరిపతి
పరమేశుని పదపద్మములను కడు
భక్తి గడిగి మధుపర్క మొసంగెను.



లగ్న మాయెనని వసిష్ఠుడప్పుడు
అగ్ని కార్యమును జరుపగ, గౌరిని
పేరంటాండ్రులు పాటలు పాడుచు
పెండ్లి చవికెకును తోడ్కొని వచ్చిరి.

సప్త మునీంద్రులు లగ్నాష్టకములు
చదువుచు హోమ మొనర్చుచునుండగ,
గౌరి కంఠమున మంగళ సూత్రము
కట్టె మహేశుడు వాద్యములందున.

ఇరువంకల ముత్తయిదువ లప్పుడు
హరపార్వతులను ప్రేరేపింపగ,
దోసిళ్ళంగొని తలబ్రా లిరువురు
పోసికొనిరి చిఱునవ్వు మొగంబుల.

బ్రహ్మదేవునకు పార్వతీశ్వరులు
భక్తి భావమున ప్రణతి యొనర్చిరి;
ముందఱ నుండిన అరుంధతమ్మను
మోడ్పుకేలుతో సందర్శించిరి.

అచ్చటి కొక స్త్రీ మేలి ముసుంగున
వచ్చి అరుంధతి ప్రక్కన నిలిచెను;
అంతలోన ఎటనుండియొ వింతగ
ఆమె చేరువకు మరు డేతెంచెను.

సుమములు గైకొని రతిమన్మథులు
ఉమా మహేశుల శిరముల జల్లిరి;
గజ్జె గట్టి రంభోర్వశు లప్పుడు
ఘల్లున నాట్యము ప్రారంభించిరి.

పెండ్లికి వచ్చిన అల్మగలెల్లరు
గొండ్లిగ తామును సయ్యాటాడిరి;
ధిమితక ధిమితక ధిం ధిం తక యని
ప్రమథులు నాడుచు పాడ దొడంగిరి.

పూల డోలికను తెచ్చి వసంతుడు
కేలు మోడ్చి నిలుచుండెను వాకిట;
లతా డోలలో ఉమా మహేశులు
రతీ మన్మథుల లాగున నొప్పిరి!

★ సంపూర్ణం ★






## 13

[ కేశవుడూ, జయమల్లూ, ముసలివాడూ తమ గుహ వదిలి బయలుదేరిన రోజునే, బ్రహ్మదండి మాంత్రికుడు కూడా, ఇద్దరు అంగరక్షకులతో వింధ్యారణ్యాలకు ప్రయాణమయాడు. కేశవుడూ వాళ్ళు, చీకటి పడే వేళకు ఒక పల్లె చేరారు. బ్రహ్మదండి కూడా అక్కడికే వస్తున్నట్టు వాళ్ళకు తెలిసింది. వాళ్ళు ముందుకు కదిలారు. తరవాత—]

కేశవుడి ముసలితండ్రి ముందుండి దారి తీయగా, అందరూ పల్లె దాటి తిరిగి అరణ్యంలో ప్రవేశించారు. ఆ సరికి బాగా చీకటి పడిపోయింది. అరణ్యం అంతా పక్షులా, జంతువులా, కూతలతో, అరుపులతో ప్రతిధ్వనించి పోతున్నది. ముగ్గురూ నిస్పృహగా ఒక చెట్టు కింద కూర్చున్నారు.

"ఈ మారువేషాల్లో బ్రహ్మదండి మనను గుర్తించ గలడంటావా?" అని అడిగాడు కేశవుడు జయమల్లును.

జయమల్లు అడ్డంగా తల తిప్పుతూ, "ఏమో చెప్పలేం. కాని, ఈ సరికే మనం ఒక పొరపాటు చేశాం. గురు మౌనానందులు, రచ్చబండ దగ్గిర కూచున్న పల్లెవాసులంతా వినేట్టుగా మాట్లాడేశారు. అలా చెయ్యకుండావుంటే బావుండేది," అన్నాడు.

"అందులో పొరపాటేమున్నది? ఈ దేశాటనలో, ఆయన తన శిష్యులతో మాత్రమే మాట్లాడతాడని నేను లోగడే చెప్పాను గదా?" అన్నాడు ముసలివాడు.



"అవుననుకో. కాని, నీ గొంతుల్లో పలికిన యాస వాళ్ళల్లో ఎవరైనా గుర్తుపడితే ఏమయేది? మనం ఈ బ్రహ్మపుర రాజ్యపు సరిహద్దులు దాటేవరకూ, చాలా జాగ్రత్తగా మసులుకోవాలి. మనం చేసే ప్రతి పనీ ఎంతో ఆలోచించి మరీ చేయాలి. కాకతాళీయంగా బ్రహ్మదండీ, మనమూ ఒకేసారి బయలుదేరటం జరిగింది. రాజగురువు వేసిన ఎత్తు తెలుసుకున్నారు గదా? ఆయనకాలి వ్రణమేదో నయం చేసేందుకు, ఈ మాంత్రికుడు మూలికల కోసం, వింధ్యారణ్యాలకు బయలుదేరాడట! మన శత్రువులు మహా జిత్తులమారివాళ్ళు," అన్నాడు జయమల్లు. ముసలివాడు అవునన్నట్టు తల వూపుతూ, చప్పున లేచి కూచుని, "ఈ దాపులనే ఎక్కడో గుర్రం సకిలించిన ధ్వని అయింది. మీకు వినబడిందా?" అని ప్రశ్నించాడు.

కేశవుడూ, జయమల్లూ జవాబు చెప్పేంతలో, ఈసారి మరింత స్పష్టంగా గుర్రం సకిలించటం వినబడింది. ముగ్గురూ ఆశ్చర్యంగా ముఖముఖాలు చూసుకున్నారు.

"బ్రహ్మదండీ, అతడి అనుచరులూ యిటే వస్తున్నారులావుంది! మన చిక్కులన్నీ తీరి, ఈ రాజ్యం సరిహద్దులు దాటి త్వరగా పారిపోవాలంటే, వాళ్ళెక్కివస్తున్న గుర్రాలను కాజేయుట యొక్కటే మార్గం," అన్నాడు ముసలివాడు.

"ఎలా? అదంత తేలికా, అయ్యా?" అన్నాడు కేశవుడు.

"అదుగో, ఆ పిలుపే మానమన్నది, గుర్తు లేదా? నేను మీ గురువును. నువ్వు కనిష్ఠుడివీ, జయమల్లు జ్యేష్ఠుడూ. మనం ఏకాంతగా వున్నప్పుడు కూడా అలాగే పిలుచుకోవటం అలవాటు చేసుకోవాలి. సరే, యిప్పుడు మీరు ఊఁ అంటే, ఆ బ్రహ్మదండి ఎక్కిన గుర్రాన్ని నేను కాజేయగలను. మీరు కూడా, అతడి అనుచరుల

గుర్రాలను కాజేయగలిగితే, తెల్లవారే సరికల్లా, ఈ బ్రహ్మపుర రాజ్యపు సరిహద్దుల్ని దాటిపోగలం. అప్పుడు, ఏ బెడదా వుండదు," అన్నాడు ముసలివాడు.

అతడి మాటలకు జయమల్లు నవ్వుతూ, "నీ ఎత్తుగడ ఏమిటి? మాంత్రికుడి గుర్రాన్ని ఎలా పట్టుకోగలవు? అతణ్ణి కత్తితో ఎదిరిస్తావా?" అని అడిగాడు.

"వాళ్ళకు ఎదురుపడి, ఈ చీకట్లో యుద్ధం చేయటం మంచిదికాదు. అప్పుడు రేగే గొడవకు పల్లెవాసులు అక్కడికివస్తే, మనం పట్టుబడిపోతాం. చడీ చప్పుడూ లేకుండా ఆ గుర్రాల మీది నుంచి వాళ్ళను పడకొట్టాలి. నేను చెట్టు మీద వుండి, మాంత్రికుణ్ణి తాడు వేసి కింద పడకొట్టి, వాడి గుర్రాన్ని వశపరుచుకోగలను," అన్నాడు ముసలివాడు.

"ఈ వయసులో నువ్వే అంత సాహసం చేయగలిగితే, గురో, మేం నీకు తీసిపోతామా? ఏం, కేశవా?" అంటూ లేచి నిలబడ్డాడు జయమల్లు.

"కేశవుడు కాదు, కనిష్ఠుడు! గుర్తుంచుకో," అంటూ ముసలివాడు కన్నుమన్నాడు. ముగ్గురూ లేచి, గుర్రాలు వస్తున్న వైపుకు బయలుదేరారు.



ఈ లోపల బ్రహ్మదండి మాంత్రికుడు, తన అంగరక్షకులైన జితవర్మా, శక్తివర్మలతో కలిసి, పల్లె కేసి వస్తున్నాడు. అతడికి ముందూ వెనకా వాళ్ళు గుర్రాలెక్కి వస్తున్నారు.

బ్రహ్మదండికి గుర్రపు స్వారి ఏ మాత్రం అలవాటులేదు. కాని, కాలినడకన ప్రయాణించటం సాధ్యంకాదు గనక, ప్రాణం బితుకుబితుకు మంటూనే గుర్రపు స్వారికి ఒప్పుకున్నాడు. చుట్టూ చీకటి, మహారణ్యం, దూరంగా క్రూరజంతువుల అరుపులు—అతడికి ఆ వాతావరణం అంతా భీతావహం కలిగిస్తున్నది.



"ఇక రేపటి నుంచీ మనం రాత్రిళ్ళు ప్రయాణించటం మానుకోవాలి. సూర్యోదయంతోపాటే మనం బయలుదేరుతాం, సూర్యాస్తమయమవగానే ఆగిపోతాం. ఇదెందుకో తెలుసా? ఆ జయమల్లూ, కేశవుడూ, వాడి తండ్రీ, మహాదుర్మార్గులు. వాళ్ళు చీకటిమాటున మన మీద దాడి చేసినా చెయ్యవచ్చు. నా గుహ కావలికాస్తున్న భటుల్ని వాళ్ళేం చేశారో, మీకు తెలుసు గదా?" అన్నాడు బ్రహ్మదండి.

మహారణ్యం మధ్య, చీకట్లో ప్రయాణమంటేనే హడలిపోతున్న జితవర్మా, శక్తివర్మలకు, మాంత్రికుడి హెచ్చరిక మరింత భీతి కలిగించింది. వాళ్ళు గుర్రాలను మరి కాస్త అదిలిస్తూ, "బ్రహ్మదండీ, నువ్వు చెప్పింది బావుంది. అలాగే చేద్దాం. ఏదీ, మనం చేరవలసిన పల్లె? ఎంతకీరాదే!" అన్నారు చుట్టూ చీకట్లోకి భయంగా చూస్తూ.

బ్రహ్మదండి వాళ్ళ ప్రశ్నకు ఏదో జవాబు చెప్పబోయి, అంతలోనే కీచుగొంతుతో, "చచ్చాను, ద్రోహం, మోసం, నా నడుంకేదో ఉచ్చుపడింది!" అంటూ అరిచాడు.

"పొరపాటు! కంఠానికని విసిరిన ఉచ్చుతాడు, నడుముకు పడింది!" అన్న అవహేళన చెట్టు మీది నుంచి వినబడింది. అదే సమయంలో జితవర్మా, శక్తివర్మలిద్దరూ, "వింతజంతువు! వింతమృగం!" అంటూ కెవ్వుమని అరిచి గుర్రాల మీంచి పట్టుదప్పి కిందకు పడిపోయారు.

అంతా కనురెప్పపాటు కాలంలో జరిగిపోయింది. బ్రహ్మదండి చెట్టుకొమ్మ నుంచి వేలాడుతున్నాడు. పై నుంచి అతడి గుర్రం మీదికి ముసలివాడు దూకాడు. కేశవుడూ, జయమల్లూ ఒక్క ఎగురున జితవర్మా, శక్తివర్మల గుర్రాలను అధిరోహించారు.

"జ్యేష్ఠా, కనిష్ఠా! ఊఁరండి!" అంటూ ముసలివాడు తన గుర్రాన్ని అరణ్యానికి అడ్డంపడి పరిగెత్తించసాగాడు. ఆ సరికి



బ్రహ్మదండికి కాస్త ధైర్యం వచ్చింది. అతడు తన నడుముకు బిగిసివున్నతాడును అటూయిటూ గుంజుతూ, "జితా, శక్తీ! ఎక్కడ? మీరు చూసింది వింతమృగమా? అయితే వాళ్ళు కేశవుడూ, జయమల్లూ, ముసలివాడూ అయివుంటారు. ఆ జయమల్లు ఒక్కడికే ఆ విద్య తెలుసు. వాళ్ళను వెంబడించండి. పట్టుకోండి! నరకండి!" అంటూ కేకలువేశాడు.

జితవర్మా, శక్తివర్మా ఆ మాటలతో కాస్త ధైర్యం తెచ్చుకుని లేచి నిలబడి, ఒర్రనుంచి కత్తులు దూసేంతలో, బ్రహ్మదండి ఏడుపు గొంతుతో, "జితా, శక్తీ! ఆగండి,.ఆగండి. ముందిటు రండి! నన్ను ఈ కొమ్మ నుంచి కిందికి దించండి," అని అరిచాడు.

జితవర్మా, శక్తివర్మలు అతణ్ణి సమీపించి, బ్రహ్మదండి నడుముకు బిగిసివున్న తాడును తమ కత్తులతో నరికి, దభీమంటూ కింద పడబోతున్న అతణ్ణి, మధ్యలోనే పట్టుకుని దించి నిలబెట్టారు.

పల్లె పక్కగా అరణ్యంలో రేగిన ఈ కల్లోలం, పల్లెవాసుల చెవిని బడింది. వాళ్ళు కాగడాలూ, కర్రలూ తీసుకుని అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చారు. బ్రహ్మదండినీ, అతడి అంగరక్షకుల్నీ ఆ స్థితిలో



చూసి వాళ్ళకు కలిగిన ఆశ్చర్యం అంతా యింతా కాదు.

"అలా గోళ్ళు గిల్లుకుంటూ చూస్తారేం, మతులేమన్నా పోయినయ్యా?" అంటూ బ్రహ్మదండి వాళ్ళ మీద విరుచుకుపడ్డాడు. "మేమే రాజుగారు పంపగా వచ్చిన, ఆస్థానోద్యోగులం! ముగ్గురు రాజద్రోహులు మా గుర్రాలను అపహరించుకుని, అటుగా పారిపోయారు. వాళ్ళను పట్టుకోండి. అదృష్టవంతుడికి అర్ధ రాజ్యం!" అంటూ పళ్ళు కొరికాడు.

పల్లెవాసుల్లో సాహసవంతులైన కొందరు యువకులు, బ్రహ్మదండి చూపిన వైపుకు



పరిగెత్తారు. తతిమ్మావాళ్ళు బ్రహ్మదండినీ, జిత, శక్తివర్మలనూ పల్లెకు తీసుకుపోయారు.

జయమల్లూ, కేశవుడూ, అతడి ముసలి తండ్రీ ఎక్కిన గుర్రాలు అరణ్యానికి అడ్డం పడి పరిగెత్తసాగినై. కాని, చీకటీ, దారి నడ్డగించే చెట్లకొమ్మలా, ముళ్ళపొదలా ఆటంకాల వల్ల, వాళ్ళు అనుకున్నంత వేగంగా పారిపోలేకపోయారు. ఇంతలో వాళ్ళకు వెనకగా, కాగడాలూ, కర్రలతో వస్తున్న పల్లెయువకులు కనిపించారు.

"మనం చిక్కులోపడ్డాం," అన్నాడు జయమల్లు గుర్రం మీంచి వెను దిరిగి, తమను వెంబడిస్తున్న పల్లెవాసుల కేసి చూసి.

"చిక్కుల్లోపడటం మనకేమన్నా కొత్తా? ఇది మొదటిసారీకాదు, ఆఖరుసారీకాదు," అంటూ ముసలివాడు విసుక్కుని, "అదిగో, అక్కడేదో దీపపుకాంతి లాటిది వున్నది, మీకు కనబడుతున్నదా? బహుశా, అది అరణ్యంలో నివశించే, ఏ గొడ్లకాపరి యిల్లో అయివుంటుంది. మనం సరాసరి అక్కడి కెళ్ళి, ఆ ఇంట్లో దాక్కునేందుకేమైనా అవకాశం వుందేమో ప్రయత్నిద్దాం. అంత తప్పనిసరైతే, గుర్రాలను వదిలేద్దాం," అన్నాడు.

క్షణాల మీద ముగ్గురూ, ఆ దీపపు కాంతి కనిపిస్తున్న వైపుకు తమ గుర్రాలను ఉరికించారు. వాళ్ళు దాన్ని సమీపిస్తూండగానే, చెట్లచాటు నుంచి రెండు కంఠాలు, "ఎవరా వచ్చేది? ఆగండి!" అంటూ కఠినంగా హెచ్చరించినై.

ఆ హెచ్చరిక వింటూనే ముసలివాడు గుర్రం దిగి, "అయ్యా, మీరెవరో మాకు తెలియదు. మేం యాత్రికులం. మమ్మల్ని దోచుకునేందుకు బందిపోటు దొంగలు వెంటబడితే, యిటు పారిపోయివస్తున్నాం. వాళ్ళ కాగడాలవెలుగూ, చేతుల్లో కర్రలూ మీరూ చూసే వుంటారు!" అన్నాడు.

ముసలివాడు మాట ముగించీ ముగించకముందే, దీపం గప్పున ఆరిపోయింది.

ఒక అజానుబాహుడైన కోయవాడు, పెద్ద ఈటె ఒకటి పట్టుకుని, అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చాడు. అతడు కేశవృష్ణీ, జయమల్లునూ చూస్తూనే, "మీ రా ఎగువనున్న పల్లె వైపు నుంచేనా రావటం? ఆ పల్లె వాసుల్లో సగం మందికి ధనం దోచుకోవటం వృత్తి, తతిమ్మా సగానికి వినోదం కోసం గొంతులు కోయటమే పని. మీరేమీ భయపడకండి, మీ రక్షణభారం నాది!" అంటూ పక్కకు తిరిగి, "ఓహొయ్, ఆ కాగడాలు పట్టుకువచ్చే వాళ్ళ మీద గురిచూసి బాణాలు వదలండి! వాళ్ళు మరొక్క అడుగైనా ముందుకు రాకూడదు," అన్నాడు.

అప్పటివరకూ నిశ్శబ్దంగా'వున్న ఆ ప్రాంతం కేకలతో హెచ్చరికలతో మార్మోగిపోయింది. కోయ యువకులు చెట్ల మీది నుంచీ, పొదలమాటు నుంచీ పల్లె యువకుల మీదికి గురిచేసి బాణాలు రివ్వురివ్వుమంటూ వదలసాగారు. చూస్తూండగానే ఆ ప్రదేశమంతా యుద్ధరంగంగా మారింది. అర్ధరాజ్యం వస్తుందన్న ఆశతో పల్లె యువకులూ, తమ కులపెద్ద ఆజ్ఞను పాలించే పట్టుదలతో కోయయువకులూ సంకుల సమరం సాగించారు. బాణం వేటుదాటి ముందుకు వచ్చిన పల్లెయువకులతో, కోయ యువకులు కర్రలు తీసుకుని పోరాడసాగారు. ఓ క్షణకాలం కోయల కులపెద్ద ఆ దృశ్యం కేసి చూసి, తల పంకిస్తూ, "మా వాళ్ళ ధాటికి, ఆ దుర్మార్గులు నిలబడలేరు, ఆ సంగతి నాకు తెలుసు! అయినా, యిక ఈ రాత్రికి, ఈ ప్రదేశం క్షేమకరం కాదు. నా రక్షణ కోరిన వాళ్ళను కాపాడే బాధ్యత నాది కనక, మిమ్ములను ఒక రహస్య ప్రదేశానికి తీసుకుపోతాను రండి," అంటూ బయలుదేరాడు. జయమల్లూ, కేశవుడూ, ముసలివాడూ అతనికి వెనకగా, గుర్రాలను కళ్ళాలు పట్టుకుని నడిపించుకుంటూ కదిలారు. —(ఇంకా వుంది)





# మేలుచేసినవాడు

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు రాజువై ఉండికూడా మరొకరికి భృత్యుడవయి నట్లుగా ఇలా శ్రమించటం వింతగా ఉన్నది. ఎందుకంటే రాజులు సామాన్యంగా తమకు ఎంతో మేలు చేసే భృత్యుల పట్ల కూడా అన్యాయంగా ప్రవర్తిస్తారు. ఇందుకు ఉదాహరణగా సుప్రభాకరుడనే రాజు కథ చెబుతాను, విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

పూర్వం దక్షిణాపథాన వీర్యార్థపుర మనే నగరాన్ని సుప్రభాకరుడనే రాజు పరి పాలించేవాడు. ఇతను తన కింద పని చేసే వారి పట్ల ఎంతో ఆదరాభిమానాలు కలిగి ఉండేవాడు. కాని అందరిలోకీ ధీరజుడనే వాడంటే రాజుకు చాలా ఇష్టం. ఈ ధీర

బేతాళ కథలు



జుడు రాజుగారి శయనాగార రక్షకుడు. రాత్రి రాజు నిద్రపోతూన్నంత సేపూ ఆయన ప్రాణాలకు ధీరజుడే పూచీ. ఆ కారణం చేత రాజుగారు ఆ పనికి ఎంతో నమ్మకస్తుడైన వాణ్ణి చూసి వేసుకున్నాడు. ధీరజుడలాటివాడు. మరొకరికి చెప్పని అంతరంగిక విషయాలను కూడా రాజు ధీరజుడికి చెబుతూ ఉండేవాడు.

ఒకనాటి రాత్రి రాజుగారు తన శయనాగారానికి పోతూ ధీరజుడితో, "రేపు వేటకు బయలు దేరాలనిపించింది. నేను నిద్రలేచే సరికల్లా వేట సన్నాహాలన్నీ సిద్ధంగా ఉండాలని చెప్పవలసిన వారికి చెప్పు," అన్నాడు.

ధీరజుడు ఆ పని వెంటనే ముగించి తన పని తెల్లవార్లూ సాగించాడు. తెల్లవారుతూనే రాజుగారు నిద్రలేచి, శయనాగారం నుంచి బయటికి వస్తూ ధీరజుడితో, "ఏమోయ్, ఏర్పాట్లన్నీ జరిగాయా? వేటకు బయలుదేరే వారంతా సిద్ధంగా ఉన్నారా?" అని అడిగాడు.

ధీరజుడు దిగులు ముఖం పెట్టి, "మహారాజా, తమరు ఇవాళ వేటకు వెళ్ళవద్దు. తెల్లవారుజామున నాకొక చెడ్డ కల వచ్చింది. అలాటి కలలు నిజమవుతాయుంటారు. వేటకు వెళ్ళే మార్గంలో తమ రథాన్ని లాగే గుర్రాలు బెదిరి, దారీ తెన్నూ చూడకుండా పరిగెత్తినట్టూ, రథం చక్రాలు ఊడినట్టూ, రథం ఎత్తు నుంచి పల్లంలోకి పడిపోయి, గుర్రాలూ, రథ సారథీ, రథంలో ఉన్న మనిషీకూడా మరణించినట్టూ నాకు కల వచ్చింది. కల నిజమైనా, అబద్ధమైనా, తమరీ రోజు వేటకు వెళ్ళకుండా ఉండటం మంచిది," అన్నాడు.

ఈ కల నిజమవుతుందో, కాదో చూద్దామని రాజుగారు తాను వేట ప్రయాణం మానేసి తన రథాన్ని మాత్రం వేట సిబ్బంది వెంట పంపాడు. ఆ రథంలో మరొక యోధుడెవరో ఎక్కాడు. ధీరజుడి కల అక్షరాలా

నిజమయింది. దారిలో గుర్రాలు బెదిరి అతి వేగంగా రథాన్ని ఈడ్చుకు పోయాయి. సారథి వాటిని అదుపులోకి తేలేక పోయాడు. రథం ఒక గుట్ట మీదుగా పోతూండగా దాని చక్రాలు ఊడాయి. రథం గుట్టపై నుంచి కిందికి దొర్లి చూర్ణమై పోయింది. గుర్రాలూ, సారథీ, రథంలో కూచున్న యోధుడూ మరణించారు.

ఆ సాయంకాలం ఈ వార్త తెలియగానే రాజు ధీరజుణ్ణి పిలిచి, తన ప్రాణం కాపాడి నందుకు అతన్ని ప్రశంసించి, మంచి బహుమానం ఇచ్చాడు.

కొంతకాలం గడిచింది. దీపావళి వచ్చింది. తెల్లవారితే దీపావళి అనగా ధీరజుడికి మరొక కల వచ్చింది. ఆ కలలో కోట గోడ మీద ఉండే బురుజు విరిగి పడి పోవటం ధీరజుడు స్పష్టంగా చూశాడు. ఈ కల కూడా రాజుగారికి సంబంధించినదే. ఎందుకంటే దీపావళినాటి రాత్రి రాజుగారు ఆ బురుజు పైకి వెళ్ళి నగర శోభ చూసి ఆనందిస్తాడు.

ఈ విషయం స్ఫురించగానే ధీరజుడు రాజుగారితో, "మహారాజా, తమరీ రోజు నగరపు దీపోత్సవం చూడటానికి బురుజు ఎక్క వద్దు. ఆ బురుజు విరిగి పడిపోయి



నట్టు నాకు తెల్లవారు జామున కల వచ్చింది," అన్నాడు.

రాజుకు ఆశ్చర్యం కలిగింది. కాని ధీరజుడికి పూర్వం వచ్చిన కల నిజమయింది గనక ఈ సారికూడా అతని సలహా ప్రకారమే చేద్దామనుకున్నాడు. ఆ రాత్రి ఆయన బురుజెక్కటానికి బదులు నగరపు వీధులు తిరగటానికి బయలు దేరాడు. ఆయన బయలుదేరిన రెండు ఘడియల లోపల ఆ బురుజు పెళపెళా రావాలతో కూలి పడిపోయింది. ఆ సమయానికి రాజుగారు బురుజుపై ఉండి నగరశోభను తిలకిస్తుంటారని తెలిసిన

పురజనులు రాజుగారికి అపాయం జరిగిం దనికూడా అనుకున్నారు.

తన ప్రాణాన్ని మరొకసారి కాపాడి నందుకు రాజుగారు ధీరజుడికి ఈసారి మరింత గొప్ప బహుమతి ఇచ్చాడు.

మరి కొంతకాలం గడిచింది. ధీరజుడికి మరొక చెడు కల వచ్చింది. ఎవరో ఇద్దరు మనుషులు రాజుగారి ఉద్యానవనంలో విహరిస్తున్నారట. వారిలో ఒకడు రాజుగారి అంగరక్షకుడని ధీరజుడు స్పష్టంగానే గమ నించాడు. ఆ మనుషు లిద్దరూ ఒక సంపంగి పొద వద్ద ఆగి సంపంగి పూల వాసన అనుభవిస్తుండగా ఒక పాము బుస్సున బయటికి వచ్చి రెండో మనిషిని కాటు వేసింది. ఆ మనిషి గిలగిలా తన్ను కుని అక్కడే ప్రాణం వదిలాడు.

కల ముగిసినాక ధీరజుడికి ఆ రెండో మనిషి రాజుగారే అయి ఉండవచ్చునన్న అనుమానం కలిగింది. ఆ సాయంకాలం రాజుగారు తన అంగరక్షకుడి వెంట ఉద్యా నానికి బయలుదేరుతున్నట్టు తెలియగానే ధీరజుడు తనకు తెల్లవారుజామున వచ్చిన పీడ కలను జ్ఞప్తికి తెచ్చుకుని, "ఈ రోజు తమరు ఉద్యానానికి వెళ్ళవద్దు," అని హెచ్చరించి తన కల విన్నవించాడు.



రాజుగారు తన ప్రయాణం మానుకుని తన అంగ రక్షకుడితో ఆ సంగతి చెప్పి, "కావలిస్తే నీవు ఉద్యానం వెళ్ళిరా," అన్నాడు. రాజుగారి అంగరక్షకుడు ఉద్యా నానికి బయలుదేరాడు. దారిలో అతనికి ఎరిగిన మనిషి ఒకడు కనిపించి అతడి వెంట వచ్చాడు.

ధీరజుడు కల గన్నట్టుగానే ఆ ఇద్దరూ సంపంగి పొద దగ్గిర ఆగి పూల సువాసన ఆనందించే సమయంలో పొదలో నుంచి ఒక తాచు పాము బుస్సుమని బయట కొచ్చి, అంగరక్షకుడి వెంట ఉన్నవాణ్ణి కాటేసి పొదలో మాయమయింది.

ఆ మనిషి కిందపడి గిలగిలా కాసేపు తన్నుకుని సంపంగిపొదల పక్కనే ప్రాణాలు వదిలాడు.

ధీరజుడి కల మూడోసారి రుజువు కావటమేగాక, మూడోసారి రాజుగారి ప్రాణాన్ని కాపాడింది. కాని రాజుగారు ధీరజుణ్ణి మెచ్చుకుని బహుమతి ఇవ్వటానికి బదులు శయనాగార రక్షకుడి ఉద్యోగం నుంచి తొలగించేశాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, సుప్రభాకర మహారాజు ధీరజుడికి రెండు సార్లు బహుమానం ఇచ్చి, మూడోసారి తన ప్రాణాన్ని కాపాడగానే ఉద్యోగం నుంచి తొలగించటానికి కారణమేమిటి? రాజులో కృతజ్ఞతాభావం లోపించిందా? లేక రాజుకు ఉన్నట్టుండి ప్రాణం పైన విరక్తి కలిగిందా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ధీరజుణ్ణి ఉద్యోగం నుంచి తీసి వెయ్యటంలో రాజు సరి అయిన పనే చేశాడు. తెల్లవార్లూ మేలుకుని ఉండి రాజుగారి శయ్యాగారాన్ని రక్షించ వలసిన ధీరజుడు నిద్రపోయి కలలు కనటం పెద్ద నేరం. ధీరజుడు తన ప్రాణాన్ని కాపాడాడన్న కృతజ్ఞతతో రాజు ఈ నేరాన్ని రెండుసార్లు క్షమించాడు. మూడోసారి ఉద్యోగం నుంచి తొలగించటం తప్ప మరే శిక్ష విధించకుండా వదిలి పెట్టాడు. ఇదే అలవాటైపోతే ధీరజుడు రాజు కోసం రోజూ నిద్రపోయి రాజుగారి ప్రాణానికి మరొక విధంగా ముప్పుతెస్తాడు. అందుకే రాజు ధీరజుడు తనకు రక్షకుడుగా పనికిరాడని నిర్ణయించాడు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. —[శ్రీ ఎన్. లక్ష్మీ నారాయణ రచన ఆధారంతో]






# మృగశిరుడు

ఒకప్పుడు గ్రీసు దేశంలో సముద్రతీరాన ఒక వృద్ధుడూ, అతని భార్యా ఉండేవారు. వృద్ధుడు తేనెటీగలను పెంచేవాడు; సేద్యం కూడా చేసుకునేవాడు. వారికి సంతానం లేదన్నది ఒక్కటే చింత. పేదరికం కూడా వారిని బాధించలేదు. అందుకే వారు పేద వారై ఉండికూడా ఎప్పుడు ఏ అతిథి వచ్చినా సంతోషంగా అతిథ్య మిచ్చేవారు.

ఇలా ఉండగా ఒక రాత్రి సముద్రం మీది నుంచి బలంగా ఈదురు గాలి వీచి సముద్రం కల్లోలంగా ఉన్న సమయంలో వారి గుడిసె ముందు కొక బాటసారి వచ్చాడు. ముసలివాళ్ళు ఆ బాటసారికి స్వాగతం చెప్పి గుడిసెలోకి ఆహ్వానించారు.

వారు తమ అతిథి కోసం తమకు గల ఒక్క దూడనూ చంపి వండి పెట్టారు, తమ వద్ద మిగిలి ఉన్న కొద్దిపాటి మద్యమూ ఆయనకు తాగటాని కిచ్చారు, తమకు గల ఒక్క పక్క మీదా ఆయనను ఆ రాత్రి పడుకోనిచ్చారు.

మర్నాడు ఉదయం అతిథి తన దారిన బయలుదేరినప్పుడు వృద్ధుడు కొంత దూరం సాగనంపటానికి వెళ్ళాడు. ఇద్దరూ సముద్ర తీరాన నిలబడి ఉన్నప్పుడు అతిథి ముసలి వాడితో, "తాతా, నీకు తీరని కోరిక ఏమైనా ఉందా?" అని అడిగాడు.

"కొడుకు లేడన్న విచారం తప్ప నాకే లోటూ లేదు, బాబూ. ముసలివాణ్ణి అయాను. ఇక సంతు కలిగే దారి కూడా లేదు," అన్నాడు వృద్ధుడు.

"నీ కోరిక తీరాలంటే నేను చెప్పినట్టు చెయ్యి. నిన్న నీవు నా కోసం చంపిన దూడ తోలుతో ఒక తిత్తి తయారు చేసి అందులో సముద్రపు నీరు నింపి, మీ ఇంటి అగ్ని హోత్రం సరసనే భూమిలో దాచిపెట్టు. తొమ్మిది మాసాల అనంతరం ఆ తిత్తి పైకి

గ్రీకు పురాణ కథ



తీసి కోసి చూస్తే లోపల మీ కొక శిశువు దొరుకుతాడు," అని చెప్పి ఆ అతిథి అల్ల కల్లోలంగా వున్న మహాసముద్రంలో ప్రవేశించి అదృశ్యుడైపోయాడు.

వృద్ధుడు అత్యాశ్చర్యంతో తన గుడిసెకు తిరిగి వచ్చి అతిథి చెప్పిన ప్రకారమే దూడ చర్మంతో తిత్తి చేసి, అందులో సముద్ర జలం నింపి, తన అగ్నిహోత్రం సమీపంగా భూమిలో పాతేశాడు. తొమ్మిది మాసాల అనంతరం ఆ తిత్తి తవ్వి తీసి, తెరిచి చూస్తే అందులో కేరింతాలు కొడుతూ అందమైన కుర్రవాడు దొరికాడు. వాడికి మృగశిరుడని పేరు పెట్టుకున్నారు.

మృగశిరుడు ఆయేటి కాయేడు మరింత బలంగానూ, అందంగానూ పెరిగి వేటలో అసమాన ప్రతిభాశాలిగా తయారయాడు. మానవమాత్రు లెవరికీ లేని దివ్య శక్తి వాడికి ఒకటి ఉండేది—అందరూ నేలమీద నడిచినట్టుగా వాడు నీటిపై నడవగలిగేవాడు.

మృగశిరుడు పెద్దవాడై, వృద్ధులైన తలిదండ్రులు చనిపోయాక, తన బ్రతుకు తెరువు చూసుకునేటందుకు దేశాటనకు బయలుదేరాడు. అతను సముద్రం మీదుగా, అలలపైకి ఎక్కుతూ, దిగుతూ ప్రయాణం చేసి చివరకు ఒక దీవి చేరాడు. ఈ దీవిని ఏలే రాజు మృగశిరుడికి అతిథ్యం ఇచ్చి చక్కగా గౌరవించాడు. అయితే మృగశిరుడు ఈ మర్యాద దక్కించుకోక రాజకుమార్తెను ప్రేమించి, ఆమెను తన కిచ్చి వివాహం చెయ్యమని రాజును కోరాడు.

నీటి మీద నడిచే శక్తి ఒకటి ఉన్నది తప్ప మృగశిరుడు అనామకుడు, అతని తల్లిదండ్రులు ఉత్తమ వంశానికి చెందిన వారు కారు, పైపెచ్చు పేదవారు. అందువల్ల రాజుకు మృగశిరుడు తన అల్లుడు కావటం ఇష్టం లేకపోయింది. అందుచేత ఆయన మృగశిరుడి కోరికను తోసి పుచ్చటానికి ఒక యుక్తి పన్నాడు. ఆ సమయాన

ఆ దీవిలోని కొండ ప్రాంతంలో అనేక క్రూర మృగాలుండి ప్రజలకు తీరని హాని చేస్తూ ఉండేవి. మృగశిరుడు ఆ మృగా లన్నిటినీ నిశ్శేషంగా చంపితే తన అల్లుడు కాదగినవాడుగా పరిగణిస్తా నన్నాడు రాజు.

వేటాడటం మృగశిరుడికి ఉగ్రపాలతో అబ్బిన విద్య. అందుచేత అతను ప్రతి ఉదయమూ బయలుదేరి వెళ్ళి, చీకటి పడేదాకా వేటాడి, రాత్రికి రాజ భవనానికి తిరిగి వచ్చి తాను చంపిన మృగా లన్నిటినీ రాజు ఎదట పెట్టసాగాడు. ఇలా కొంత కాలం గడిచాక అతను రాజుతో, "మీ దీవి లోని క్రూర మృగాలన్నిటినీ చంపేశాను. ఇప్పుడు ఒక సింహంగాని, ఎలుగుబంటి గాని, తోడేలుగాని మచ్చుకైనా లేదు," అని చెప్పాడు.

రాజు సంతృప్తి చెందలేదు. మృగ శిరుడికి తన కుమార్తె నివ్వటం ఆయనకు కొంచెంకూడా ఇష్టం లేదు. అందుచేత ఆయన అతనితో, "నీవు నిజంగా వేటలో ఆరితేరిన వాడివే. కాని క్రూరమృగం ఇంకా ఎక్కడైనా మిగిలి ఉన్నదేమో కొద్ది రోజులు వేచి చూద్దాం," అన్నాడు.

ఇలా కొంతకాలం రాజు తాత్సారం చేసిన మీదట మృగశిరుడు ఆయనను తొందర పెట్టసాగాడు. రాజు అబద్ధాలకు





దిగి, ఎక్కడో భల్లూకం కనిపించిందని ఎవరో అన్నారనీ, ఎవరో పిల్లలు తోడేలును చూసి దడుచుకున్నారనీ తనకు వార్తలు వచ్చినట్టు అతనితో చెప్పాడు. రాజు చెప్పిన ఈ అసత్య వార్తలను బట్టి మృగశిరుడు క్రూర మృగాల కోసం ఎంతో వెతికాడు, కాని అవి అతనికి కనిపించనే లేదు. అతనికి చిరాకు వచ్చింది.

చివరకు అతన్ని వదిలించుకునేటందుకు రాజు మరొక ఎత్తు వేశాడు. ఆయన కొందరు మనుష్యులను పిలిచి, "మీరు మృగశిరుణ్ణి బాగా తాగించి, రాజకుమార్తెను ఎత్తుకు పొమ్మని ప్రేరేపించి, అందుకై అతను బయలుదేరగానే నాకు కబురు చేయండి," అన్నాడు. వారు మృగశిరుడి మైత్రి సంపాదించి, అతని చేత ప్రతి రాత్రీ తాగించి, "రాజకుమార్తెను రాజు తానై నీ కిచ్చి పెళ్లి చెయ్యడు. ఎందుకువచ్చిన బెడద? ఒక రాత్రివేళ నీవే ఆమెను ఎత్తుకుని పారిపో!" అని సలహా ఇస్తూ వచ్చారు.

వినగా వినగా ఈ సలహా మృగశిరుడి తలకు పట్టింది. ఒక రాత్రి అతను తప్ప తాగి రాజ భవనంలో రాజకుమార్తె ఉండే గది ప్రవేశించాడు. ఈ సంగతి ముందుగానే తెలును గనక రాజు తన భటుల సహాయంతో అతన్ని పట్టుకున్నాడు.

"దిక్కూ దివాణమూ లేనివాణ్ణి చేరదీసి అతిథి మర్యాదలు చేసినందుకు నీవు మాకు చేసే ప్రత్యుపకారం ఇదా? భటులారా, ఈ నీచుడి కళ్ళు రెండూ పీకేసి, వీణ్ణి ఈడ్చుకు పోయి సముద్రతీరాన పారేసి రండి," అన్నాడు రాజు.

ఆ విధంగా మృగశిరుడు గుడ్డివాడై, మళ్లీ ప్రపంచ యాత్ర సాగించవలసిన స్థితిలో పడ్డాడు. ఇక ఏమి చేయాలో తెలీక అతను సముద్రం ఒడ్డున పడి ఉండగా రాత్రి అయింది. ప్రపంచం యావత్తూ నిశ్శబ్దం ఆవరించింది. ఆ నిశ్శబ్దంలో అతనికి

సముద్రం మీది నుంచి అస్పష్టంగా సమ్మెటల మోత వినవచ్చింది. అతను లేచి సముద్రం మీదుగా నడుచుకుంటూ ఆ ధ్వని వినవచ్చిన దిక్కుగా వెళ్ళాడు. సముద్ర మధ్యంలో ఒక అగ్ని పర్వతం ఉన్నది. అక్కడ ఒకే కన్ను గల కంచరులు రాత్రింబగళ్ళు పని చేస్తూ ఉండేవారు. వారు రాక్షసకాయులు.

తమను వెతుక్కుంటూ వచ్చిన మృగశిరుణ్ణి ఈ కంచరులు కొద్ది రోజులు తమ వద్ద ఉంచుకుని ఆదరించారు. తరవాత వారి పెద్ద అతనితో, "మృగశిరా, నీ అంధత్వం పోయే ఉపాయం ఉన్నది. తూర్పు సముద్రంలో నుంచి సూర్యుడు పైకి వచ్చేటప్పుడు నీ వక్కడికి వెళ్ళావంటే ఆ కాంతికి నీ కళ్ళు మళ్ళీ మొలుస్తాయి," అని చెప్పాడు.

కాని సూర్యుడు ఉదయించే సముద్ర ప్రాంతానికి గుడ్డివాడైన మృగశిరుడు ఎలా వెళ్ళగలడు? అందుకని అతనికి ఒక కుర్రవాణ్ణి తోడిచ్చారు. ఆ కుర్రవాణ్ణి తన భుజాల మీద ఎక్కించుకుని మృగశిరుడు వాడి సహాయంతో సముద్రం మీద నడుస్తూ సూర్యోదయ మయ్యే చోటికి బయలుదేరాడు.

చాలా ప్రయాసపడి ప్రయాణించి వారిద్దరూ సూర్యుడు ఉదయించే చోటికి



చేరుకుని సూర్యోదయం కోసం వేచి ఉన్నారు. సూర్యుడి తొలి కిరణాలు కళ్లపై పడగానే మృగశిరుడికి తిరిగి చూపు వచ్చేసింది. అతను వెంటనే తిరుగు ప్రయాణమై కుర్రవాణ్ణి కంచరులకు అప్పగించి, తన కళ్ళు తీసిన రాజు ప్రాణాలు తీయటానికి సంసిద్ధుడై బయలుదేరాడు.

తనపై పగ తీర్చుకోవటానికి మృగశిరుడు వస్తున్నాడని తెలిసి రాజు దాక్కున్నాడు. తరవాత మృగశిరుడు మృగాలను వేటాడుతూ గ్రీసు దేశమంతా తిరిగి గొప్ప ఖ్యాతి సంపాదించాడు. ఈ ఖ్యాతితో అతని తల తిరిగిపోయి, "భూమి మీద ఒక్క వన్య మృగం కూడా లేకుండా చేస్తాను," అని శపథం చేశాడు.

ఈ శపథం విని భూదేవి ఆగ్రహించి అతనిపైకి ఒక దయ్యపు తేలును పంపింది. ఆ తేలుపైన తన బాణాలు వేసీ, తన కత్తితో నరికీ చంపటానికి ప్రయత్నించాడు మృగశిరుడు. కాని తేలు చెక్కు చెదర లేదు. అందుచేత అతను తేలుకు భయపడి పారిపోసాగాడు. అతనికి దారిలో ఏడుగురు గంధర్వ కన్యలు కనిపించారు. అతను తేలు మాట మరిచిపోయి వారిని వెంబడించాడు. ఆ కన్యలలో వెనకబడిన కన్య అతనికి చిక్కబోయే స్థితిలో వారు ఏడుగురూ గువ్వలరూపం ధరించి ఆకాశానికి ఎగిరిపోయారు.

మృగశిరుడు నివ్వెరపడి ఆకాశం కేసి చూస్తూ ఉండగా తేలు వెనుక నుంచి వచ్చి అతన్ని కాటువేసి చంపేసింది.

ఈనాడు మనం ఆకాశంలో చూసే వృశ్చికరాశే ఆ తేలు. దానికి పడమరగా కనిపించే నక్షత్రాల కూటమే మృగశిర. మృగశిరకు ఇంకా పడమరగా కనిపించే నక్షత్రాలే కృత్తికలు. ఈ మూడూ ఆకాశంలో ఒకదాన్ని ఒకటి ఇంకా తరుముతూనే ఉన్నాయి.





# బుద్ధి రవాణా

చిత్రపురి ఒక చిన్న రాజ్యం. యువరాజు చిత్రవర్మ క్రొత్తగా రాజ్యానికి వచ్చి పరిపాలిస్తున్న రోజులవి. చిత్రవర్మకు రాజ్య పాలనలో అంతగా అనుభవం లేకపోయినా బుద్ధిమంతులు, సమర్థులు, అయిన మంత్రులు, తదితర రాజోద్యోగుల సాయంతో రాజ్యాన్ని పాలిస్తూ వుండేవాడు.

చిత్రపురి రాజ్యాన్ని ఆనుకునే అంగ రాజ్యం వుండేది. అది అన్ని విధాలా చిత్రపురి కన్నా పెద్దది. దానికి వర్ధనుడు రాజు. అతడికి ఎన్నాళ్ళుగానో చిత్రపురిని జయించి తన రాజ్యంలో కలుపుకోవాలని కోర్కె వుండేది. చిత్రవర్మ తండ్రి రాజుగా వున్నంత కాలం ఆ కోర్కె ఫలించలేదు. ప్రస్తుతము చిత్రవర్మ ఆ రాజ్యానికి రాజు. అతనికి ఇంకా బాగా రాజకీయాలూ, యుద్ధ మెళుకువలూ, తెలిసి వుండవని వర్ధనరాజు ఊహించాడు.

ఒక దినం మంత్రులను పిలిపించి, తన కోర్కెనూ, ఊహలనూ చెప్పి, వారి సలహా కోరాడు. దానికి వారు సంతోషించి ఇలా చెప్పారు: "మీ ఊహ సరి అయినది. ఈ సమయంలోనే చిత్రపురిని జయించడానికి అవకాశాలున్నవి. ఎంతైనా ప్రత్యర్థి యొక్క బుద్ధి బలాలు తెలుసు కొననిదే కయ్యానికి కాలుదువ్వరాదు. కనుక చిత్రపురి రాజోద్యోగుల బుద్ధి బలాన్ని ముందుగా పరీక్షించి తెలుసుకోవాలి."

"ఆ పరీక్ష ఏదో వెంటనే నిర్వహించండి," అని వర్ధనుడు అమాత్యులను ఆదేశించాడు. వారు అందరూ కలిసి మంత్రాలోచనము చేసి, ఒక లేఖ వ్రాసి వర్ధనుడికి ఇచ్చి, "దీనిని చిత్రవర్మకు పంపించండి. సమాధానం ఏమి వస్తుందో చూచుకొని మిగత విషయాలు ఆలోచిద్దాము," అని చెప్పారు. ఆ లేఖలో ఇలా వ్రాసివుంది: "మీ రాజ్యం

అమంచర్ల ప్రజ్ఞాపారమిత



నుంచి కొంత బుద్ధిని రవాణా చేసి మాకు పంపించాలి."

చిత్రవర్మకు ఆ లేఖ, వర్ధనుడి రాయబారి ద్వారా అందింది. అది చదివి అతడు ఆశ్చర్యపోయాడు. అమాత్యులకు చూపించాడు. వారు కూడా ఆశ్చర్యపోయారు. మంత్రులు రాజుతో సమావేశమైనారు. వారికి వర్ధనుడి కోర్కె వింత గొలిపింది. ఏదైనా వస్తువులూ, సామగ్రీ అయితే రవాణా చేయవచ్చును. అదృశ్యవస్తువులను ఎలా పంపటం? ఈ విచిత్రమైన కోర్కె, ఏదో పెద్ద ఎత్తుగడ వేసికొని చేసినదై వుంటుంది. తమ బుద్ధి చాతుర్యాలను పరీక్షించడానికి వర్ధనుడు ఈ పరీక్ష పెట్టి వుంటాడని, అమాత్యులందరూ ఇట్టే అర్థంచేసుకున్నారు.

చిత్రవర్మ చాలా కళవళ పడిపోయాడు. ఎంతగా ఆలోచించినా సరియైన త్రోవ దొరకలేదు. ఆ సమయంలో అందరిలోకి చిన్నవాడైన మంత్రి బృహస్పతి లేచి, "రాజా! నాకు ఒక నాలుగు నెలలపాటు గడువు ఇప్పించండి. వర్ధన రాజు కోరినట్లు బుద్ధి రవాణా చేస్తాను. అయితే ఈ విషయమై నన్ను, మీరు ఈ నాలుగు నెలలూ ఏమీ ప్రశ్నించవద్దు" అని అన్నాడు. చిత్రవర్మ సంతోషంగా అతను కోరిన గడువు ఇచ్చాడు. ఆ తర్వాత, వర్ధనుడికి, "మీరు కోరిన విధంగా బుద్ధిని రవాణా చేస్తాము! కానీ నాలుగు మాసాలు గడువు కావాలి," అని లేఖ పంపాడు.

నాలుగు నెలలు దాదాపుగా గడిచిపోవచ్చినవి. ఒక దినం బృహస్పతి, ఒక పెద్ద మూటతో సహా, మంత్రుల రహస్య సమావేశ మందిరంలోకి ప్రవేశించాడు. అతడు రాజువైపు తిరిగి, "మహారాజా! ఈ మూటలోనే వర్ధనుడు కోరిన "బుద్ధి" వుంచి. జాగ్రత్తగా, మూటకు దెబ్బ తగలకుండా వెంటనే వర్ధనరాజుకు పంపే ఏర్పాట్లు చేయండి," అన్నాడు. ఆ మూట

చాలా జాగ్రత్తగా కట్టబడివుంది. దానిలో ఏముందోనని ప్రతి ఒక్కరికి అనుమానంగా వుంది. కానీ ఎవరూ ఏమీ అడగలేదు. చిత్రవర్మ కూడా ఏమీ ప్రశ్నించకుండానే ఆ మూటను అంగ రాజ్యానికి పంపించాడు.

పెట్టిన గడువు లోపల చిత్రవర్మ నుంచి తను కోరినట్లు బుద్ధి రవాణా అయినందుకు వర్ధనరాజు ఆశ్చర్యపడ్డాడు.

వర్ధనుడు, అతని మంత్రులు మూటను జాగ్రత్తగా విప్పారు. అందులో ఒక సన్నటి మూతిగల కుండ వుంది. దానిలో పెద్ద గుమ్మడికాయ ఒకటి వుంది. ఆ గుమ్మడి కాయ సరిగ్గా, సందు లేకుండా కుండలో యిమిడిపోయి వుంది. తొడిమ మాత్రము కుండ మూతిలో నుంచి బయటకు వచ్చి వున్నది. కుండకు ఎక్కడా పగుళ్ళు కానీ, బీటలుగానీ లేవు. అది కొత్త కుండ. ఇది చూచి వర్ధనుడికి, అమాత్యులకు అమిత ఆశ్చర్యం కలిగింది. ఆ కుండ మూతికి ఒక ఉత్తరం కట్టబడి వుంది. దాన్ని ఆత్రుతగా విప్పి చదివాడు వర్ధనుడు. దానిలో ఇలా వ్రాసి వుంది: "వర్ధనులవారు కోరినట్లు 'బుద్ధి'ని పంపించాము. ఈ కుండ లోపల బుద్ధి వుంది. కుండ పగుల కొట్టకుండా మీరు గుమ్మడికాయను వెలికి తీసి



కోండి. ఈ కానుక అందిన వెంటనే తెలియ పరచవలెను."

ఒకరినొకరు చూచుకొని స్తబ్ధులైనారు రాజూ, మంత్రులూ. వారికి పెద్ద సందేహం కలిగింది. ఇంత చిన్న మూతిగల కుండ లోనికి, అంత పెద్దది, సరిగ్గా కుండలోకి ఇమిడి పోగల గుమ్మడికాయ ఎట్లా దూరింది? అందులోకి ఎట్లా పట్టగలిగింది? ఎంతగా ఆలోచించినా ఎవ్వరికీ ఏమీ తోచ లేదు. పైగా కుండ పగుల గొట్టకుండా గుమ్మడికాయను బయటకు తీసికోవాలిట. అదే "బుద్ధి" అట! నిజానికి ఇది అసాధ్యం! అందరూ మౌనం దాల్చి, తలలు వంచారు.

ఆఖరికి వర్ధనుడు అమాత్యులను ఉద్దేశించి ఇలా అన్నాడు : "మనము అనుకున్నంత తెలివి తక్కువవారు కాదు మన ప్రత్యర్థులు. ఇంత బుద్ధి బలం కలిగిన వారితో కయ్యంకంటే, స్నేహమే మేలు." వెంటనే ఆయన చిత్రవర్మకు ఈ విధంగా కబురు పంపించాడు. "మీరు పంపిన కానుక అందినది. మిమ్ములను ఈ తరుణంలో ప్రశంసించకుండా వుండలేక పోతున్నాను. మీ స్నేహ, సౌహార్దాలను కాంక్షిస్తున్నాను."

ఈ వర్తమానం అందుకొని చిత్రవర్మ అత్యంతానందం పొందాడు. అతడికి, 'వర్ధనుడు అడిగిన బుద్ధి ఎట్లా చేరింది?' అని ఆశ్చర్యం కూడా కలిగింది. బృహస్పతిని పిలిపించి, మనస్ఫూర్తిగా అభినందించి, గౌరవించి, "అమాత్యా! మీరు చేసిన పని, నా గౌరవాన్ని నిల బెట్టి, మన రాజ్యానికి ప్రతిష్ఠ ప్రసాదించింది. మీ లాటి వారు, మా రాజ్యానికి ఎంతైనా అవసరం. అసలు ఇంతకూ తమరు ఏమి చేశారో శలవిస్తారా?" అని అడిగాడు. దానిగి బృహస్పతి ఇలా సమాధానము చెప్పాడు:

"ఇందులో నేను పెద్దగా చేసిన దేమీ లేదు. నాలుగు మాసాల క్రితం నేను గుమ్మడి తీగను వేసి పెంచాను. కొద్ది రోజులకు అది పుష్పించి, చిన్న పిందెలు వేసింది. ఒక చిన్న పిందెను, సన్న మూతిగల ఒక కుండలో వుంచి జాగ్రత్తగా పోషించాను. ఆ గుమ్మడి పిందె కుండలోనే పెరిగి పెద్దదయింది. బాగా కుండలో సరిగ్గా ఇమిడేటంతటి పెద్దది కాగానే తొడిమ దగ్గర కోసి, కుండను గుమ్మడితో సహా జాగ్రత్తగా మూట కట్టి, మీ ద్వారా దానిని వర్ధనుల వారికి పంపాను. కుండను పగుల గొట్టకుండా గుమ్మడిని తీసికోమనీ, అదే వారు కోరిన "బుద్ధి" అనీ ఒక లేఖకూడా వ్రాసి పంపాను. దానికి వారి వద్ద నుంచి వచ్చిన సమాధానం ఇక తెలిసినదే!"





# రాజసన్మానం

చదువు పూర్తి అయిందని గురువుగారు చెప్పారు గనక పాపన్న ఇక ఇంటికి బయలుదేర వలసిన సమయం వచ్చింది. కాని వట్టి చేతులతో ఇంటికి వెళితే బాగుండదు. అందుచేత పాపన్న రాజా స్థానానికి వెళ్ళి తాను చదివిన చదువు కాస్త ప్రదర్శించి ఏదో ఒక బహుమానం పుచ్చుకుని ఇంటికి పోతే కొంచెం ఘనంగా ఉంటుందని నిశ్చయించాడు.

పాపన్న రాజనగరుకు పోయేదారిలో ఒక అరణ్యం ఉన్నది. అతను ఆ అరణ్యపు కాలి బాట వెంబడి నడుస్తూండగా, ఎదురు వైపు నుంచి, "పారి పోతున్నాడు, పట్టుకో! పట్టుకో!" అన్న కేకలు వినపడ్డాయి. ఆ క్షణంలోనే ఒక యువకుడు తన కేసి పరిగెత్తుకు వస్తూ ఉండటమూ, వాణ్ణి ఇద్దరు రాజభటులు తరుముతూ ఉండటమూ పాపన్న చూశాడు.

యువకుడు జుట్టు చెదిరి, బట్టలు చినిగి, అనుమానించదగినవాడుగా ఉన్నాడు. వాడు రాజ భటులకు చిక్కకుండా పారిపోతున్న నేరస్తుడని పాపన్న ఊహించాడు. అసలే పరోపకారి, అందులోనూ రాజ దర్శనార్థం వెళుతున్నవాడు; అందుచేత పాపన్న ఆ వచ్చే యువకుణ్ణి అవలీలగా పట్టుకుని రాజభటులకు అప్పగించాడు. వాళ్ళా యువకుడి నోట్లో గుడ్డలు కుక్కి, చేతులు విరిచి కట్టి, పాపన్నతో, "అయ్యా, సమయానికి వచ్చి సహాయపడ్డావు," అన్నారు.

"మీ రేమీ సంకోచించ వద్దు, మీకు నా వల్ల ఇంకే సహాయం కావలిసినా చేస్తాను," అన్నాడు పాపన్న.

"అయితే వీడి పని పూర్తి అయినదాకా మా వెంటనే ఉండు ఒకసారి వీడు మాకు చిక్కకూడా ఎలాగో కట్లు విడిపించుకుని మమ్మల్ని చావ గొట్టి పరిగెత్తాడు. మీరు



రాబట్టి మళ్ళీ మాకు దొరికాడు," అన్నారు రాజభటులు.

"సరే అయితే పదండి," అన్నాడు పాపన్న. వాళ్ళు అడవికి అడ్డం పడి ఒక నిర్జనమైన గుహ వద్దకు చేరుకున్నారు.

"ఇక్కడ మనకు తెల్లవారే లోపుగా పని ఉన్నది. దేవీ పూజ చెయ్యాలి. ఇక్కడే ఉంటాం," అంటూ వాళ్ళు పాపన్నను గురించి వివరాలు అడిగారు. తాను చదువు పూర్తి చేసి ధనార్జన కోసం నగరానికి పోతున్నట్టు పాపన్న వారితో చెప్పాడు.

రాజభటుల్లో ఒకడు, "నేనిప్పుడు నగరానికే పోతున్నాను. నీకు మంచి బహుమానం ఇవ్వవలసిందనీ, మాకు ఎంతో సహాయం చేశావనీ మా నాయకుడితో చెబుతాను," అంటూ బయలుదేరిపోయాడు.

వాడు వెళ్ళిన కాస్సేపటికి రెండో రాజభటుడు, "మా వాడు రెండు మూడు గంటల దాకా రాడు. ఈ దుర్మార్గుడు చావ చితక కొట్టేశాడు. చాలా బడలికగా ఉంది. ఒక్క కునుకు తీస్తాను. నీవు మాత్రం వీణ్ణి జాగ్రత్తగా చూస్తూ ఉండు," అని నడుము వాల్చి నిద్రపోయాడు.

అంతకు ముందే వాళ్ళు ఆ యువకుణ్ణి అక్కడ ఉండే ఒక చెట్టు మానుకు కట్టేశారు. ఆ యువకుడు కొంచెం సేపు గడిచాక దాహం అవుతున్నట్టు పాపన్నకు సైగ చేశాడు. పాపన్న పరోపకార పారీణుడు గనక లేచి వెళ్ళి, కోనేటి నుంచి ఆకు దొన్నెలో నీరు తెచ్చి, యువకుడి నోటిలో కుక్కిన గుడ్డలు లాగేశాడు.

అప్పుడా యువకుడు నీరు తాగి పాపన్నతో, "వీళ్ళు రాజ ద్రోహులు. నేను రాజు కొడుకును. ఈ భటు లిద్దరినీ మా సేనాపతి నాకు అంగరక్షకులుగా నియమించాడు. నేను వీళ్ళను వెంట బెట్టుకుని చీకటి పడే వేళకు, ఊరి వెలపల ఉండే కోవెలకు బయలుదేరాను. ఒక నిర్జనమైన

చోట ఇద్దరూ నా పైన పడి బంధించి అరణ్య మార్గాన ఈడ్చుకు రాసాగారు. దారిలో నేను చేతి కట్లు ఎలాగో తప్పించుకుని వీళ్ళను మెత్తగా తన్ని పారిపోవటానికి యత్నించాను. ఇంతలో యమకింకరుడి లాగా నా ప్రాణానికి దాపరించావు. చూడగా నాకు సేనాపతి ఏదో పెద్ద దుర్మార్గం తలపెట్టినట్టున్నది. మా రాజ్యం కాజేస్తాడో ఏమో! నన్ని దుర్మార్గులు ఇక్కడ బలి ఇస్తారు. ఈ ద్రోహులలో ఒకడు నగరం వెళ్ళాడు. బహుశా సేనాపతితో నేను పట్టుపడ్డట్టు చెప్పటానికయి ఉంటుంది. నీవు చూస్తే వీళ్ళ మనిషివి లాగాలేవు. అలాటప్పుడు వీళ్ళ కెందుకు సహాయం చేస్తున్నావు?" అన్నాడు.

పాపన్న ఈ మాటలు విని విస్మయం చెందాడు. పరోపకార బుద్ధి తన చేత రాజద్రోహం చేయించిందని తెలుసుకుని, "రాజకుమారా, నా కీ గొడవ ఏమీ తెలియదు. ఎవరికన్నా చేతనైన ఉపకారం చెయ్యటం మంచి పని అని చదువుకున్నాను. ఈ రాజభటులు సాయం కోరారు, అందుకని సాయపడ్డాను. మిమ్మల్ని విడిపిస్తాను. మీకు ద్రోహం తల పెట్టిన వారిని శిక్షించండి," అన్నాడు, యువరాజు కట్లు విప్పుతూ.




"నీవు కూడా నా వెంట వచ్చెయ్యి. లేకపోతే వీళ్ళ వల్ల నీకు ప్రమాదం!" అన్నాడు యువరాజు.

"ఫరవా లేదు. నేను బలశాలిని, ఇటువంటి వెధవలకు పదిమందికి సమాధానం చెప్పగలను. వీళ్ళు పారిపోకుండా చూస్తూ ఉంటాను. మీరు వెళ్ళి నమ్మకమైన భటులను తీసుకురండి," అన్నాడు పాపన్న.

యువరాజు వెళ్ళిపోయాక పాపన్న పొదలచాటుకు వెళ్ళి నిద్రపోయే దొంగ లేపటం కోసం ఎదురు చూడసాగాడు. కొంత సేపటికి వాడు లేచి కూచుని యువకుడు లేకపోవటంతో కంగారు పడసాగాడు.

అప్పుడు పాపన్న ఇవతలికి వచ్చి, "ఇదేమిటి? ఆ ద్రోహిని వదిలినట్టున్నావే?" అని ప్రశ్నించాడు.

"ఛీ, నీవే ఆ పని చేసి ఉంటావు," అన్నాడు రాజభటుడి వేషంలో ఉన్నవాడు.

"నేనెందుకు వదిలి పెడతాను? వదిలి పెట్టేవాణ్ణయితే అసలు పట్టిస్తానా? ఇంకా నా కేదో మీ నాయకుడు బహుమతి ఇస్తాడని గంపెడాశతో ఉన్నాను. దాహమై కాసిని నీళ్ళు తాగి వచ్చేలోపుగా వాణ్ణి తప్పించేసి నా నోట కరక్కాయ కొట్టావు! పారిపోతున్న వాణ్ణి పట్టుకున్నానంటే మీ నాయకుడు ఎలా నమ్ముతాడు? నీ తరహా చూస్తే 'రాజద్రోహిలాగున్నావు!" అని రాజభటుడి పైన నేరం మోపాడు పాపన్న.

వాడు తెల్లపోయి, "నే నేమీ ఎరగను. ఇప్పుడే నిద్రలేచాను. వాడూ నువూ కలిసి పారిపోయారని కూడా అనుకున్నాను. వాడంతట వాడు ఎట్లా తప్పించుకుంటాడూ? మా నాయకుడు వస్తే ఏమని చెప్పటం?" అని మథనపడ్డాడు. ఇంతలో మొదటి రాజభటుడు సేనాపతినీ, మరి ఇద్దరు భటులనూ తీసుకువచ్చాడు. "ఏడీ? ఆ రాజ కుమారుడి తల నా కళ్ళ ఎదట తెగితే చెరొక మాన్యమూ ఇచ్చేస్తాను," అంటూ సేనాపతి అటూ ఇటూ చూశాడు.



"అయ్యా, వీళ్ళకి సహాయం చేశాను. నా సేవ మరవకండి," అన్నాడు పాపన్న.

కాని రాజకుమారుడు తప్పించుకు పోయాడని తెలిశాక సేనాపతి ఉగ్రుడై పోయాడు. ఆయన నిప్పులు కక్కుతూ, ఒర నుంచి కత్తి దూసి ఇద్దరు రాజభటులనూ చంపబోయాడు.

"మహారాజా, తమరు తొందర పడకండి. రాజకుమారుడు దొరికిన మాట నిజమే. నేనే స్వయంగా పట్టుకున్నాను. అతణ్ణి ఇక్కడికి తెచ్చాం. చెట్టుకు కట్టాం. మీ కోసం వీడు బయలుదేరే సమయానికి రాజకుమారుడు చెట్టుకు కట్టే ఉన్నాడు గనక వీడి పైన ఆగ్రహించటం అన్యాయం. తరవాత ఈ రెండోవాడు కొంచెం సేపు నిద్రపోయిన మాట నిజమే. అదికూడా వాడి తప్పనటానికి లేదు. పాపం, వాణ్ణి రాజకుమారుడు చచ్చేటట్టు తన్ని హూనం చేసి నాకనే పట్టుబడ్డాడు. అదీగాక నేను రాజకుమారుడికి కాపలా ఉంటానని మాట ఇచ్చిన మీదటనే వాడు నిద్రపోయాడు. కాపలా ఉన్నవాణ్ణి మంచి నీటికని అలా వెళ్ళటం నాదే పొరపాటు. నేను తాగి దొన్నెతో తెచ్చాను—వీడు నిద్రలేచి దాహమంటాడేమోనని. ఇదుగో చూడండి ఆ నీరింకా అలాగే ఉన్నది. రాజకుమారుడు



పారిపోయిన నేరం న్యాయంగా నాదే, కావలిస్తే నా తల తీయండి!" అన్నాడు పాపన్న. రాజకుమారుడు ఎలా మాయ మయిందీ సేనాపతికి అంతు చిక్కలేదు. "కట్టు తాళ్ళుకూడా లేవు. వాడు ఏ పొదలో నన్నా దూరాడేమో వెతకటం మంచిది," అని పాపన్న సలహా ఇచ్చిన మీదట అక్కడి పొదలన్నీ గాలించ నారంభించారు.

ఇంతలో రాజకుమారుడు వందమంది యోధులతో చడీ చప్పుడూ లేకుండా వచ్చి, సేనాపతినీ, అతని భృత్యులైన నలుగురు భటులనూ పట్టుకున్నాడు.

అందరూ కలిసి నగరానికి వెళ్ళేటప్పుడు పాపన్నకూడా వెంట వెళ్ళాడు. సేనాపతిని విచారణ చేశారు. ఆయన తన కేమీ తెలియ దనీ, రాజకుమారుణ్ణి పట్టుకుపోయిన వారికి శిరచ్ఛేదం విధించవలసిందేననీ అన్నాడు. రాజకుమారుడి తల తన ఎదట తెగితే మాన్యంయిస్తానని సేనాపతి అన్నట్టు పాపన్న సాక్ష్యం చెప్పాడు. సేనాపతికి మరణ దండన విధించారు.

పాపన్న ఆ రోజు రాజకుటుంబం పాలిటికి ఒక దేవుడయాడు. అతనికి ఎన్నో కానుక లిచ్చారు. ఎంతో గొప్పగా సన్మానం చేసి, ఆతిథ్యం ఇచ్చారు. తరవాత రాజ కుమారుడు అతన్ని కొలువులో ఉండమని కోరాడు. పాపన్న ఇంటికి వెళ్ళి తల్లికి కనపడి మళ్ళీ వస్తాననీ, తాను ఇల్లు వదిలి చాలా ఏళ్ళయిందనీ చెప్పి, తనకు వచ్చిన కాను కలూ, తన తల్లికి రాణీగారిచ్చిన కానుకలూ పుచ్చుకుని ఇంటికి బయలుదేరాడు.

"దారిలో దొంగల భయం ఉంటుం దేమో, భటులను వెంట పంపిస్తాను," అన్నాడు రాజకుమారుడు.

"నా కేమీ భయం లేదు. నాకు నేనే రక్షకుణ్ణి," అంటూ పాపన్న రాజకుమారుడి వద్ద సెలవు పుచ్చుకున్నాడు.

—[పై సంచికలో మరొక సంఘటన]



# ఎవరిది వారికే!






# అన్నా-చెల్లెలు

పూర్వం డమాస్కస్ నగరంలో అయ్యూబ్ అనే వర్తకుడికి ఇద్దరు చక్కని చుక్కల్లాటి పిల్లలుండేవారు. అయ్యూబ్ కొడుకు పేరు ఘానిం, కూతురు పేరు ఫిత్నా. వారిద్దరికీ యుక్త వయసు వచ్చే సమయంలో అయ్యూబ్ ఆకస్మికంగా మరణించాడు. ఆయన సొత్తు యావత్తూ ఆయన పిల్లలదయింది. తన తండ్రి సొత్తును చూసుకోవటంలో ఘానిం కొన్ని మూటలు చూశాడు. వాటన్నిటి మీదా "బాగ్దాద్ రవాణా" అని రాసి ఉన్నది. అవి వంద మూటలు. వాటిలో సిల్కు తానులూ, జలతారు తానులూ ఉన్నాయి. ఇవిగాక వంద జాడీలలో కస్తూరి డబ్బీలున్నాయి. వీటిపైన కూడా "బాగ్దాద్" అని రాసి ఉన్నది. వాటన్నిటినీ బాగ్దాదుకు తీసుకుపోయి అయ్యూబ్ విక్రయింతామనుకున్నాడు. మృత్యుదేవత ఆ ఆలోచనకు అంతరాయం కలిగించింది.

తన తండ్రి చేయలేకపోయిన పని తానే చేద్దామని ఘానిం నిర్ణయించుకున్నాడు. అతను మరికొందరు వర్తకుల బిడారుతో కలిసి, అద్దెకు తెచ్చిన ఒంటెలపై తన సరుకంతా ఎత్తించి, తల్లికీ, చెల్లెలికీ వస్తానని చెప్పి, బాగ్దాదుకు ప్రయాణమయాడు.

ఘానిం క్షేమంగా బాగ్దాదు నగరం చేరాడు. ఒక చక్కని ఇల్లు అద్దెకు తీసుకుని, అరువు తెచ్చిన వరుపులతోనూ, మంచాలతోనూ, తివాసీలతోనూ, పరదాలతోనూ, దాన్ని చక్కగా అలంకరించాడు. తన సరుకంతా దింపించి, తన కొత్త ఇంట విశ్రాంతి తీసుకున్నాడు. తరవాత అతను పది నమూనాలు తన వెంట తీసుకుని బాగ్దాదు వర్తకకేంద్రానికి వెళ్ళాడు. అక్కడి వర్తకుల పెద్ద ఆ నమూనాలను చూస్తూనే వాటికి తాను ఇవ్వటానికి సిద్ధంగా ఉన్న ధర చెప్పాడు.

సి. మాధవరావు



ఆ ధరకు అమ్మితే ఘానిం పెట్టుబడి మీద రెండింతలు లాభం వస్తుంది.

ఘానిం పరమానంద భరితుడైనాడు. అతను ఏడాదిపాటు బాగ్దాదులోనే ఉండి పోయి తన సరుకు కొంచెం కొంచెమే మంచి లాభానికి అమ్ముతూ వచ్చాడు. రెండో ఏడు ఆరంభంలో ఒకనాడు అతను మామూలు ప్రకారమే కొంత సరుకు తీసుకుని వర్తక కేంద్రానికి వెళ్ళేసరికి దుకాణాలన్నీ మూసి ఉన్నాయి. వర్తక కేంద్రం సింహద్వారమే తాళం వేసి ఉన్నది. కారణం విచారించగా వర్తక ప్రముఖులలో ఒకడు పోయినట్టూ, మిగిలిన వర్తకులంతా శవం వెంట శ్మశానానికి బయలుదేరినట్టూ తెలిసింది. తాను కూడా శ్మశానానికి వెళ్ళటం భావ్యంగా ఉంటుందనుకుని ఘానిం శవం ఊరేగింపును చేరుకున్నాడు.

శవాన్ని పెద్ద మశీదు దగ్గిర ఆపి, ప్రార్థనలు పూర్తి అయాక శ్మశానంలో సమాధులుండే చోటికి చేర్చారు. అక్కడ ఒక డేరా ఏర్పాటుచేసి దివిటీలూ, కొవ్వొత్తులూ వెలిగించారు. శవాన్ని సమాధి చేసినాక ఇమాములు కొరాన్ పఠనం వగైరాలు చాలాసేపు జరిపారు. ఘానింకు ఎప్పుడు ఇంటికి వెళ్ళిపోదామా అని ఉన్నప్పటికీ, ఉత్తర క్రియల తంతు ముగిసేదాకా ముళ్ళ మీద ఉన్నట్టు ఉండిపోయాడు. ఈ కర్మకాండ అయాక విందు జరిగింది. అందరూ కుత్తుకబంటిగా తిన్నారు, తాగారు. తరవాత అందరూ గోరీ చుట్టూ మౌనంగా కూచున్నారు. వారు తెల్లవార్లూ అలాగే కూర్చుంటారని ఘానిం గ్రహించి ఏదో మిష చెప్పి అక్కడినుంచి చల్లగా జారుకున్నాడు.

అతని భయమల్లా తన ఇంటిని దొంగలు కొల్లగొడతారనే. ఇంట్లో తాను తప్ప మరెవరూ ఉండరు. తానా కొత్తవాడు. తన దగ్గిర చాలా డబ్బుంటుందని పట్టణంలో అందరికీ తెలిసిపోయింది. డబ్బు పుష్క

లంగా ఉండి నిర్జనంగా ఉండే ఇంటిని దొంగలు వదిలిపెడతారా?

ఘానిం గోరీల మధ్యగా దారి చూసుకుంటూ నగరద్వారాన్ని చేరేసరికి అర్ధరాత్రి దాటిపోయింది. ద్వారం మూసేశారు. అంతటా నిశ్శబ్దంగా ఉంది. అప్పుడప్పుడూ నక్కల కూతలూ, తోడేళ్ళ అరుపులూ వినవస్తున్నాయి. ఘానింకు భయం వేసింది. దొంగల భయం కాస్తా ప్రాణభయంగా మారింది. అతను ఆ రాత్రికి ఎక్కడైనా తల దాచుకునే చోటు దొరుకుతుందా అని వెతుకుతూ, వచ్చిన దారినే బయలుదేరి ఒక సమాధి వద్దకు వచ్చాడు.

ఆ సమాధి ప్రత్యేకమైనదిగా కనిపించింది. దాని చుట్టూ ఎత్తయిన రాతి గోడలున్నాయి. ఆవరణలో ఒక పోకచెట్టు పెరుగుతున్నది. ఘానిం ఈ సమాధిలోకి చేరి నడుము వాల్చాడు, కాని అతనికి నిద్ర పట్టలేదు. తన చుట్టూ దయ్యాలు మసులుతూ ఉన్నట్టనిపించి కన్ను మూత పడలేదు. ఇంతలో దూరంగా అలికిడి అయింది. ఘానిం ప్రహరీగోడ వాకిలి వద్దకు వెళ్ళి బయటికి చూశాడు. పట్టణం దిక్కునుంచి ఎవరో మనుషులు ఒక పెట్టెను మోసుకుంటూ తాను ఉన్న సమాధి కేసి రావటం కనిపించింది. ఇద్దరు నీగ్రోలు పెట్టెను



మోస్తున్నారు, మూడోవాడు దివిటీ పట్టుకుని ముందు నడుస్తున్నాడు.

ఏమిచెయ్యటానికీ పాలుబోక ఘానిం పోకచెట్టు ఎక్కి దాని ఆకులచాటున దాక్కున్నాడు. కొద్దిసేపటికి నీగ్రోలు ముగ్గురూ ఆ ఆవరణలో ప్రవేశించి, పెట్టెను దింపి, దాన్ని పూడ్చటానికి తగినంత పెద్ద గొయ్యి తవ్వి, ఆ పెట్టెను గోతిలో పూడ్చి తమ దారిన తాము వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళినాక కూడా ఘానిం చెట్టు మీదనే ఉండి, తూర్పు తెల్లవారినాక దిగి వచ్చాడు. ఉత్త చేతులతో మట్టి తీసివేసి, నీగ్రో బానిసలు పూడ్చి పోయిన పెట్టెను పైకి తీశాడు. ఆ పెట్టె మూతకు తాళంవేసి ఉన్నది. ఘానిం ఆ తాళాన్ని ఒక రాతితో పగలగొట్టి మూత తెరిచి చూసేసరికి లోపల ఒక స్త్రీ కనిపించింది.

ఘానిం ఆశ్చర్యపడ్డాడు. ఆమె చని పోయి ఉంటుందనుకున్నాడు, కాని ఆమె ఊపిరి పీలుస్తూనే ఉన్నది. ఆమె చాలా అందగత్తెగా కూడా కనిపించింది. కిట్టనివా రెవరో ఆమెకు మత్తు మందు పెట్టి, తమ నౌకర్ల చేత ఇక్కడ పాతేయించి ఉంటారని ఘానిం అనుకున్నాడు.

అతను ఆమెను పెట్టెలో నుంచి పైకి తీసి చల్లగాలికి నేలపై పడుకోబెట్టాడు. వెలుతు





రులో చూస్తే ఆమె మరింత అందగత్తెగా కనిపించటమేగాక, ఆ పాదమస్తకమూ ఆమె ఒంటినిండా అమూల్యమైన నగలుండటంకూడా అతనికి కనబడింది. ఆమె ధరించిన నగలనిండా రత్నాలు ధగధగలాడుతున్నాయి.

బయటికి తీసి పడుకోబెట్టగానే ఆమె ఒక్క తుమ్ము తుమ్మి వాంతి చేసుకున్నది. గోలికాయంత భంగు మాత్ర, పైకి వచ్చేసింది. అయినా ఆమె కింకా సరిగా స్పృహ రాలేధు. ఆమె తన పరిచారికలను కాబోలు పిలిచి, "నాకు దాహంగా ఉన్నది. తాగటానికేమైనా ఇవ్వండే! ఒక్కరూ పలకరే మ్రా?" అన్నది. ఎవరూ పలకకపోవటం చూసి ఆమె కళ్ళు తెరిచి భయంతో, "ఇదేమిటి? నే నెక్కడున్నాను? నా ఇల్లెక్కడ? ఈ శ్మశాన మేమిటి?" అన్నది.

ఘానిం ముందుకు వచ్చి, "నా పేరు ఘానిం. పవిత్రమైన మీ పేరేమిటో నాకు తెలియదు, కాని మీరు భయపడవలసిన అవసర మేమీ లేదు. కష్టసమయంలో మిమ్మల్ని ఆదుకోమని భగవంతుడు నన్ను పంపాడు," అన్నాడు.

ఘానిం రూపమూ అతని మాటలూ ఆమెకు కొంత ఊరట కలిగించాయి. ఆమె అతని ద్వారా, తనను పెట్టెలో ముగ్గురు నీగ్రో బానిసలు అక్కడికి తెచ్చి పాతిపెట్టి పోయిన సంగతి వివరంగా విన్నది. ఆమె అతనితో, "మీరు నన్ను ఈ పెట్టెలో దాచి పెట్టి, వెళ్ళి ఒక కంచర గాడిదను అరువు తెచ్చి, త్వరగా నన్ను పెట్టెతో సహా మీ ఇంటికి చేర్చండి. అక్కడ నా కథ అంతా చెబుతాను. నన్ను రక్షించినందుకు మీకు గొప్ప మేలుకూడా కలుగుతుంది," అన్నది.

అప్పటికి బాగా తెల్లవారింది. ఘానిం ఒక కంచర గాడిదను సంపాదించి, దాని మీద యువతి ఉన్న పెట్టెను పెట్టి తన ఇంటికి తీసుకు వెళ్ళాడు. ఆమె అందం

అతన్ని బలంగా ఆకర్షించింది. ఆమె తనని పెళ్ళాడటానికి ఒప్పుకుంటుందనీ, అదే తనకు పట్టనున్న నిజమైన అదృష్టమనీ అతను కలలు కన్నాడు.

ఘానిం ఇంటినీ, ఆ ఇంటో ఉన్న అమూల్యమైన పట్టు వస్త్రాల బేళ్ళనూ చూసి నాక ఆ యువతికి అతనొక గొప్ప వర్తకుడని తెలిసిపోయింది. ఆమె అతని కేసి మరింత శ్రద్ధగా చూసి అతను చాలా అందగాడైన యువకుడని కూడా గ్రహించింది.

ఘానిం ఇంటికి వస్తూనే బజారుకు వెళ్ళి ఆమె కోసం భోజన పదార్థాలూ, పానీయాలూ, తట్టల కొద్దీ పూలూ, పట్టుకు వచ్చాడు. వాటన్నిటినీ చూసి ఆమె పొందిన ఆనందం ఘానిం ప్రేమను రెట్టింపు చేసింది. ఇద్దరూ భోజనం చేసినాక అతను ఆమె కథ వినగోరాడు. ఆమె ఈ విధంగా తన కథ చెప్పింది :

"నా పేరు కూతల్ కులూబ్. నేను ఖలీఫాగారి దివాణంలోనే పుట్టి పెరిగాను. నేను పెరిగి పెద్దదాన్నవుతున్న కొద్దీ నా అందం ఖలీఫాగారి హృదయాన్ని వలలాగా చుట్టివేయసాగింది. ఆయన నన్ను పెళ్ళాడ నిశ్చయించి నాకొక ప్రత్యేకమైన బస ఏర్పాటుచేసి, పది మంది బానిస పడుచు



లను నా సేవకు నియోగించి, నాకు ఎన్నో కానుకలూ, నా వంటిపైన ఉన్న నగలలాటి ఖరీదైన నగలూ కట్టబెట్టారు. మా వివాహం కాపటానికి ఒక అంతరాయం వచ్చింది— హఠాత్తుగా ఖలీఫాగారు యుద్ధానికి వెళ్ళవలిసి వచ్చింది.

"ఖలీఫాగారికి నా పైన ప్రేమ ఏర్పడిన నాటి నుంచీ జుబేదా రాణిగారికి నా పైన అసూయ ఏర్పడింది. నా దాసీలలో ఒకతె పూర్వం ఆమె పరిచారికగా ఉండేది. దానికి లంచం పెట్టి ఆమె నన్ను హతమార్చటానికి ప్రయత్నించినట్టున్నది. ఖలీఫా దూరాన ఉండటం ఆమెకు లాభించింది.

"నిన్న రాత్రి ఈ పరిచారిక నాకు తాగటానికి చాలా మద్యం ఇచ్చింది. నేను ఒళ్లు తెలియని స్థితిలో వుండగా, అది భంగు ఉండనా నోట వేసి ఉండాలి. నేను కాళ్ళూ చేతులూ కొట్టుకుని ప్రాణం పోతున్నంత బాధ పడటం జ్ఞాపకమున్నది నాకు స్పృహ తప్పిపోగానే జుబేదా రాణిగారు నన్ను పెట్టెలో పెట్టించి, తన నీగ్రో బానిసల చేత పాతిపెట్టించి ఉంటుంది. మీరు సమయానికి వచ్చి నా ప్రాణాలు కాపాడారు.

"ఇప్పుడు నాకు విచారమల్లా ఏమిటంటే, ఖలీఫా తిరిగి వచ్చి నేను లేకపోవటం చూసి ఏమనుకుంటారోనని! ఇంకొక విచారం కూడా లేకపోలేదు—నేను' అది వరకే ఖలీఫాగారికి అంకితం కాకపోతే మిమ్మల్ని మనసారా ప్రేమించి ఉందును. ఇప్పుడా అవకాశం లేదు."

ఆమె ఖలీఫాను పెళ్ళాడబోతున్నదని వినగానే ఘానిం కల్పించుకున్న గాలిమేడలన్నీ కుప్పున కూలిపోయాయి. అతని ప్రేమ బాధగా మారింది. ఆమెకు తన పైన ప్రేమ ఏర్పడిందని తెలిశాక ఆ బాధ పదింతలయింది. అతని అవస్థ వర్ణనాతీతం. అతను కూతల్ కులూబ్‌ను ప్రేమించకుండా ఉండలేడు. ఆమె తనను ప్రేమిస్తున్నదన్న మాట మరిచిపోలేడు. ఆమెను తన దాన్ని చేసుకుని ఖలీఫాకు ద్రోహం చెయ్యలేడు. అతను సాధ్యమైనంత వరకు తప్పించుకుని దూరంగా ఉంటూ, తన భగ్నప్రేమతో కుమిలిపోతూ రోజులు గడపసాగాడు. అయినా అతను ఆమెకు అతిథి మర్యాదలు ఏమీ తక్కువ చేయలేదు. ఇద్దరూ కలిసే భోజనం చేసేవారు. కబుర్లు చెప్పుకునేవారు. ఆమెకు కూడా అతనిపై రోజురోజుకూ ప్రేమ పెరిగి పోతున్నది. దాన్ని ఆమె దాచలేదు. అయినప్పటికీ ఘానిం ఎంతో నిగ్రహం తెచ్చి పెట్టుకుని ఆమె పట్ల ఎంతో పవిత్రంగా ప్రవర్తించాడు. —[ఇంకా ఉంది]






ఆ రోజు తాతయ్య పీచు మిఠాయి తెచ్చాడు. అందరికీ తలా ఒకటీ ఇచ్చాడు. అందరూ పీచు మిఠాయి తీసుకున్నారుగాని బుల్లాడు దాన్ని చూసి దడుచుని, దగ్గిరికి తెస్తే మొహం తిప్పేసుకున్నాడు.

"బాగుంటుంది, తీసుకోరా, 'బాబూ," అని తాతయ్య ఎంత చెప్పినా దాని కేసి చూడలేదు బుల్లాడు.

"వాళ్ళంతా ఎలా తినేస్తున్నారో, చూడూ!" అన్నాడు తాతయ్య.

"నా కది సయించదు," అన్నాడు బుల్లాడు.పిల్లలందరూ గొల్లున నవ్వి, "వట్టి కోతలు, తాతయ్యా. వాడికి పీచు మిఠాయంటే భయం!" అన్నారు.

"పిరికి వాని మదిని బింక మీలాగురా అని వేమన చెప్పినట్టే చేశావు గదరా!" అంటూ తాతయ్య కుర్చీలో చేరగిలబడి కూచుని పొడుంకాయ తీశాడు.

"మంచి కథ చెప్పు, తాతయ్యా," అంటూ పిల్లలు చుట్టూ చేరారు.

"కథా? వేరే కథ ఎందుకూ? పిరికి వాడి కథే చెబుతానూ!" అంటూ తాతయ్య చిటికెడు పొడుం పీల్చి ఆరంభించాడు.

ఒక ఊళ్ళో ఒక రైతుండే వాడు. అతగాడికి నాలుగైదు కుంటల పొలం ఉండేది. ఆ రైతు మహా మెత్తనివాడూ, పిరికి వాడూనూ. మెత్తనివాణ్ణి చూస్తే మొత్త బుద్ధవుతుందంటారు. నక్కను చూసిన వాడల్లా వేటగాడేనన్నట్టు, అందరూ ఆ రైతును ఏదో విధంగా అన్యాయం చేస్తూనే ఉండేవాళ్ళు. ఆ మనిషి అన్నీ భరించి తాను గొప్ప శాంత స్వభావం గల వాణ్ణని తృప్తి పడుతూండేవాడు.

ఈ రైతు పొలం పక్కన మరొకడి పొలం ఉంది. ఆ పొరుగు వాడికూడా ఇతగాడంటే అలుసే; వాడు ఈ రైతంటే

అలుసై ఇష్టం వచ్చినట్టు అన్యాయాలు చేస్తూ ఉండేవాడు.

పొరుగింటి కలహం విన వేడుక అని సామెత. ఒక రోజున ఎవరో వచ్చి రైతుతో, "ఏమయ్యోయ్, పొరుగు రైతు మీ వరి చేలోకి బ్రెను తోలాడు," అని చెప్పాడు.

"పొరపాటున చేసి ఉంటాడులే. దాని కూడా రాద్ధాంతం దేనికి?" అన్నాడు పిరికివాడు.

మర్నాడు ఇంకో మనిషి వచ్చి, "పొరుగు రైతు మీ చేను కోస్తున్నాడయ్యోయ్. వెళ్ళి చూసుకో!" అన్నాడు.

"పాపం, వాళ్ళ కీ యేడు పంట పాడయిందిలే. కోస్తే కోసుకోనీ. ఇంతలో నాకు పెద్ద కరువొచ్చి పోదులే," అన్నాడు పిరికివాడు.

సాగితే సాగించుకోమన్నారు, జారితే పడమన్నారు. పొరుగు రైతుకు పిరికివాడంటే మరీ అలుసై పోయింది. వాడు ఈ పిరికివాడి పొలం గట్టున ఉన్న చెట్ల కొమ్మలు నరుక్కున్నాడు.

ఈ సంగతి వినే సరికి పిరికివాడికి పుండు మీద పులుసు పడ్డట్టయింది. వాడు ఆవేశంతో పొరుగువాడి దగ్గిరికి వెళ్ళి, "పోనీ, పోనీ అని ఊరుకుంటుంటే మరీ నెత్తి కెక్కుతున్నావే! నా గట్టు మీద చెట్ల కొమ్మలు నువ్వెందుకు నరక పలిసి వచ్చిందీ?" అని అడిగాడు.

"ఇంకా నయం, చెట్లే నరకలేదు. నీ చెట్ల వేళ్ళు మా పొలంలోకి వచ్చాయి. నీ చెట్టు కొమ్మలు మా పొలం మీదికి వచ్చాయి. కొట్టారంటే కొట్టరూ!" అన్నాడు అవతలివాడు.

పిరికివాడి బింకం పిసరులో ఇంకుతుందిట. పిరికి రైతు వాడితో, "నిన్ననే దేమిటిలే! నిన్ను పొరుగు చేను కోవటం నాదే అసలు తప్పు!" అని ఇంటికి చక్కా పోయాట్ట!






ఈ లోపుగా భరతుడు రామాశ్రమాన్ని అంతదూరంలో చూసి, తన తల్లులను తీసుకు రమ్మని వసిష్ఠుడికి చెప్పి, సుమంత్రుణ్ణీ, శత్రుఘ్నుణ్ణీ వెంట బెట్టుకుని ముందుకు వచ్చాడు. పర్ణశాల పరిసరాలలో మార్గం తెలిపే గుర్తులూ, పేర్చిన కట్టెలూ, పిడకల పోగులూ, చెట్లకు గుర్తుగా కట్టిన పేలికలూ ఉన్నాయి.

త్వరలోనే భరతుడు పర్ణశాలను సమీపించి, దానికి ఈశాన్యాన అగ్ని వేదికను చూశాడు. తరవాత పర్ణశాలలో తాపసి వేషంలో ఉన్న రాముణ్ణి చూశాడు. పక్కనే సీతా లక్ష్మణులున్నారు రాముణ్ణి చూడగానే భరతుడికి పుట్టెడు దుఃఖం వచ్చింది. అతను రాముడి దగ్గిరికి పరిగెత్తుకుపోయి, కన్నీరు కారుస్తూ, రాముడి పాదాలు కనబడక నేలపై బోర్లాపడ్డాడు. అతని నోట మాట రాలేదు. శత్రుఘ్నుడు కూడా ఏడుస్తూ రాముడి కాళ్ళకు వందనం చేశాడు. రాముడు భరతశత్రుఘ్నుల నిద్దరినీ కౌగలించుకుని కన్నీరు కార్చాడు.

అతను భరతుడిపై ప్రశ్నల వర్షం కురిపించాడు: "నాయనా, చాలా కాలానికి నిన్ను చూశాను. మారిపోయావు. గుర్తించలేక పోయాను. చాలా సంతోషం. ఇప్పుడెందు కిలా ఈ అరణ్యానికి వచ్చావు? నాయనగారు విచారం లేకుండా ఉన్నారా? తల్లులందరూ క్షేమమా? నీవు రాజధర్మాలు చక్కగా పాటిస్తూ పరిపాలన చేస్తున్నావా? నీ రాజ్యం ఎవరూ అపహరించలేదు గద?





మంత్రులు అన్ని వేళలా నీకు సహాయంగా ఉంటున్నారా ?"

భరతుడు రాజ్యాభిషేకం చేసుకున్నా డనుకుని రాముడు వేసిన ప్రశ్నలన్నిటికీ సమాధానంగా, "అన్నా, మన వంశంలో పెద్ద కొడుకుండగా చిన్నవాడు అభిషేకించుకునే ఆచారం ఎన్నడన్నా ఉన్నదా? నా వెంట అయోధ్యకు వచ్చి రాజ్యాభిషేకం చేసుకుని, మన వంశాన్ని తరింపజెయ్యి. ఇప్పుడు మన తండ్రికూడా లేడు. నే నింకా కేకయరాజు నగరంలో ఉండగానే ఆయన పోయాడు. నీవూ, సీతా, లక్ష్మణుడూ వెళ్ళి పోయిన దుఃఖం ఆయనను తన పొట్టన పెట్టుకున్నది. ముందు తండ్రిగారికి జల తర్పణాలు చెయ్యి. నిన్నే తలచుకుంటూ పోయిన ఆత్మకు నీ జలతర్పణాలే ఫల ప్రదమవుతాయి," అన్నాడు.

తండ్రి మరణ వార్త విని రాముడు మూర్ఛపోయాడు. సీతా భరతలక్ష్మణ శత్రుఘ్నులు చన్నీరు చల్లి రాముడికి మూర్ఛ తెలిసేటట్టు చేశారు. రాముడి విచారానికి అంతులేదు. తన కోసం దుఃఖించి తండ్రి చనిపోయినందుకూ, ఆయనకు తాను ఉత్తరక్రియలు చెయ్యనందుకూ తనను తాను తిట్టుకున్నాడు. తరవాత అతను తండ్రికి ఉదకదానం చెయ్యటానికి బయలు దేరుతూ, స్త్రీలూ పిల్లలూ ముందు నడవాలి గనక, సీతనూ లక్ష్మణుణ్ణీ ముందుగా నదికి బయలుదేరమన్నాడు.

సీతారామలక్ష్మణులు మందాకినీ నది రేవులో స్నానాలుచేసి దశరథుడికి నీళ్ళు వదిలారు. తరవాత రాముడు తండ్రికి సపిండీకరణం చేశాడు, గార గానుగుపిండిని రేగుపళ్ళతో కలిపి ముద్దలుచేసి దర్భలపై ఉంచాడు. తరవాత వారు ముగ్గురూ పర్ణశాలకు తిరిగివెళ్ళారు.

అంతవరకూ దూరాన ఉండిపోయిన జనం పర్ణశాల నుంచి రోదన ధ్వనులు విన







గానే అటుకేసి పరిగెత్తుకుంటూ వచ్చి ముని వేషంలో ఉన్న రాముణ్ణీ, అతని తమ్ములనూ, సీతనూ ఒక్కచోట చూశారు. రాముడికి కొందరు నమస్కారాలు చేశారు. కొందరిని రాము డాలింగనం చేసుకున్నాడు.

ఈ లోపల దశరథుడి భార్యలు వసిష్ఠుడి వెంట మెల్లిగా నడుచుకుంటూ మందాకిని ఒడ్డు మీదుగా పర్ణశాల కేసి వచ్చారు. వారికి స్నానాలరేవూ, దానికి ఎడంగా రాముడు తండ్రి నిమిత్తం పెట్టిన పిండాలూ కనిపించాయి. కౌసల్య సుమిత్రతో, "మన వాళ్ళు ఇక్కడే స్నానం చేస్తారు కాబోలు. నీ కొడుకు రాముడి కోసం ఇక్కడినుంచే నీళ్ళు తీసుకుపోతాడు కాబోలు. ఇక లక్ష్మణుడి కష్టాలు తీరాయిలే. భరతుడు రాముణ్ణి తీసుకువచ్చి రాజ్యాభిషేకం చేయిస్తున్నాడుగా! ఈ గార గానుగుపిండి ముద్దలు చూశావా? భూమండలమంతా ఏలిన దశరథ మహారాజుకు ఈ ముద్దలేమిటి, ప్రారబ్ధంగాకపోతే? పాపం, రాముడిదే తింటున్నాడు కాబోలు. తలుచుకుంటే నా గుండె పగిలిపోతున్నది!" అన్నది వచ్చే దుఃఖాన్ని అపుకుంటూ.

వారు పర్ణశాల చేరగానే రాముడు లేచి ముగ్గురు తల్లులకూ సాష్టాంగ నమస్కారం చేశాడు. సీత కూడా వారికి నమస్కరించి ఎదురుగా నిలబడింది. వనవాసంతో చిక్కిపోయి ఉన్న సీతను కౌసల్య కౌగలించుకుని, "జనకమహారాజు కూతురూ, దశరథ మహారాజు కోడలూ అయి ఉండి నీకీ వనవాసం గతి పట్టిందా, తల్లీ?" అని ఎంతగానో వాపోయింది.

రాముడూ వసిష్ఠుడూ దగ్గిరగా కూచున్నారు. రాముడికి మరొక పక్కగా భరతుడూ, మంత్రులూ, పురప్రముఖులూ కూచున్నారు. భరతుడు తాను వచ్చినపని బయటపెట్టే సమయం వచ్చింది, ఏమంటాడా అని అందరూ ఆత్రంగా వింటున్నారు.

రాముడే విషయం కదిపాడు. "భరతా, నీవు జడలూ, నారబట్టలూ, కృష్ణాజినమూ ధరించి ఈ అరణ్యానికి రావటానికి కారణ మేమిటి? వినాలని ఉన్నది," అన్నాడతను.

భరతు డిలా చెప్పాడు: "మన తండ్రి నిన్ను అడవికి పంపి నీ వియోగం భరించ లేక కాలధర్మం చేశాడు. ఆయన ఈ పాపపు పని చేయటానికి ప్రేరణ ఇచ్చినది నా తల్లి కైకేయి. అందు కామె ఘోరనరకం ఎలాగూ అనుభవిస్తుంది. ఆమె కొడుకు నైన నన్ను నీవు అనుగ్రహించాలి. వచ్చి రాజ్యాభిషేకం చేసుకో. ఇందుకే మన తల్లులూ, ఈ ప్రజలూ కూడా నిన్ను వెతుక్కుంటూ వచ్చారు. వారి కోరిక తీర్చు. ఇంతమంది కోరికను తోసిపుచ్చకు."

ఈ మాటలు చెప్పి భరతుడు తన తల రాముడి పాదాలకు తగిలేలాగా సాష్టాంగ పడ్డాడు. రాముడు భరతుణ్ణి కౌగలించు కుని నిట్టూర్చుతూ, "నాయనా, నీవు చిన్న తనం చేత నీ తల్లిని నిందించావు. పెద్దవారికి చిన్నవారిని ఎలా శాసించటానికైనా అధి కారం ఉన్నది. దశరథుడికి నన్ను అడ వికి పంపే అధికారం ఉన్నది. తండ్రి మీద లాగే తల్లి మీదా గౌరవం ఉంచాలి. పెద్దలు నన్ను అడవికి పొమ్మంటే నేను రాజ్యం ఎలా చేస్తాను? నీవు అయోధ్యకు వెళ్ళి



రాజ్యం చెయ్యాలి, నేను నారబట్టలు కట్టి వనవాసం చెయ్యాలి. ఇది మన తండ్రి ప్రజల సమక్షంలో ఏర్పరచిన నియమం. పద్నాలుగేళ్ళూ వనవాసం ముగించినాక తండ్రి ఆజ్ఞ ప్రకారం రాజ్యం చేస్తాను. తండ్రి అనతి నెరవేర్చటంకంటె నాకు రాజ్యం ఏలటం ఎక్కువైనది కాదు," అన్నాడు. ఆ రాత్రి అలాగే గడిచిపోయింది. మర్నాడు అందరూ స్నానాలూ, జప హెూమాలూ పూర్తిచేసి మళ్ళీ రాముడి చుట్టూ చేరారు. ఎవరూ మాట్లాడలేదు. ఆ నిశ్శబ్దం మధ్య భరతుడు రాముడితో, "నా తల్లిని గౌరవించి, నాకు 'రాజ్యం ఇచ్చావు. దాన్ని నీ కిస్తున్నాను, తీసుకుని సుఖంగా ఏలుకో. ఈ రాజ్యభారం మొయ్యటానికి నీవే సమర్థుడవు. గుర్రంలాగా గాడిదె నడవలేదు గదా! మన తండ్రి నీకు చిన్నతనం నుంచీ ఎంతో శ్రమపడి రాజుకు అవసరమైన శిక్షణ ఇచ్చాడు. నీవు రాజువు కాకుండాపోతే ఆయన పడిన శ్రమ అంతా వృథా అవుతుంది," అన్నాడు.

భరతుడు చెప్పిన ఈ మాటలకు చుట్టూ చేరినవారంతా ఎంతో సంతోషం వెలిబుచ్చి, ప్రశంసించారు.

అప్పుడు రాముడు భరతుడికి కొంత తత్వబోధ చేశాడు. ప్రాణులకు మరణం





నిత్యం. మనిషి ఏ పని చేస్తున్నా ఒక్కొక్క క్షణమే మృత్యువు దగ్గిరపడుతూ ఉంటుంది. ముసలివాడై అసమర్థుడైనవాడు చేయగలది లేదు; యౌవనం ఉండగానే ఆత్మవిచారం చెయ్యాలి. గడచిన క్షణం మరిరాదు. చనిపోయినవారి కోసం ఎంత చింతించీ లాభంలేదు. ఏ ప్రాణీ కూడా తన యిష్టంవచ్చినట్టు నడుచుకోలేదు. దశరథుడు ఎన్నో పుణ్యకార్యాలు చేసి స్వర్గానికి వెళ్ళాడు. అందుచేత భరతుడు మనోవైకల్యం మాని తండ్రి ఆజ్ఞను శిరసావహించి, తండ్రి జాడలలోనే నడుచుకుంటూ రాజ్యం చెయ్యటం ధర్మం. అలాగే



రాముడు తండ్రి ఆజ్ఞ మీరక వనవాసం జరపటం ధర్మం.

అంతా విని భరతుడు, "నేను ధర్మానికి వెరిచే నా తల్లిని శిక్షించలేదు, తండ్రిని బహిరంగంగా దూషించలేదు. కాని ఆయన తన భార్యకు దాసుడై, ఆమె విషం తాగుతానంటే బెదిరి, రాజ్యం చేయవలసినవాణ్ణి అరణ్యానికి పంపటం అధర్మం కాదా? తండ్రి చేసిన అన్యాయాన్ని సరిచేసి తండ్రికి నరకప్రాప్తి కలగకుండా కొడుకు చూడవద్దా? వచ్చి రాజ్యంచేసి, తండ్రి చేసిన అన్యాయాన్ని సరిచెయ్యి," అన్నాడు.

రాముడు ఇందు కెంతమాత్రమూ ఒప్పక, కైకేయిని పెళ్ళాడేటప్పుడు దశరథుడు తన మామగారితో ఆమెకు పుట్టే కొడుకుకే పట్టం కడతానని మాట ఇచ్చిన సంగతి చెప్పాడు.

అప్పుడు అక్కడ ఉన్నవారిలో జాబాలి అనే బ్రాహ్మణుడు రాముడితో, "వెర్రివాడా? ఎవరు తండ్రి? ఎవరు కొడుకు? చచ్చిపోయినవారి తృప్తి కోసం తద్దినాలు పెట్టేవాళ్ళూ, ఈ లోకంలో కష్టాలుపడేవారూ మూఢులు. పరలోకం ఎక్కడున్నది? నీవు వెళ్ళి హాయిగా రాజ్యంచేసి సుఖపడు. ప్రతి ప్రాణీ ఒంటరిగా పుట్టు



తుంది, ఒంటరిగా చస్తుంది. బతికున్నంత కాలమూ ఈ ప్రపంచం ఒక మజిలీ. ఇదే నిజం, మిగిలినదంతా భ్రమ," అన్నాడు.

"ఇవి నాస్తికు లనవలిసిన మాటలు. నీవు నాస్తికుడవని తెలియక మా తండ్రి నిన్ను చేరదీశాడు," అని రాముడు జాబాలిని నిందించాడు.

వసిష్ఠుడు అడ్డువచ్చి, "నాయనా, జాబాలి నాస్తికుడు కాడు. నీచేత రాజ్యాభిషేకానికి ఒప్పించటానికే అతను అలా చెప్పాడు," అన్నాడు. వసిష్ఠుడు కూడా పట్టం కట్టుకోమని రాముడికి ఎంతగానో చెప్పాడు. కాని రాముడు తన నిశ్చయాన్ని మార్చుకోలేదు.

అప్పుడు భరతుడు సుమంత్రుడితో, "వెంటనే వెళ్ళి దర్భలు తెచ్చి ఈ పర్ణశాల వాకిలికి అడ్డంగా పరు. రాముడు నా కోరిక తీర్చేదాకా నేను వాటిపై పడుకుని లేవను," అన్నాడు.

సుమంత్రుడు "ఏం చెయ్యమంటావు?" అన్నట్టు రాముడి కేసి చూశాడు. అది గమనించి భరతుడు తానే స్వయంగా దర్భలు తెచ్చి వాటిని పర్ణశాల వాకిలికి అడ్డంగా పక్క వేసుకుని పడుకున్నాడు.

అది చూసి రాముడు భరతుడితో, "నాయనా, ఈ పనిచేసేవారు అప్పులు వసూలు చేసుకోలేకపోయిన బ్రాహ్మణులు. ఇది క్షత్రియులు చేసేపనికాదు. అదీగాక నేను నీ కేమీ ద్రోహం చేశానని వాకిలికి అడ్డం పడుకుంటావు? లే, అయోధ్యకు తిరిగివెళ్ళి పో," అన్నాడు.

భరతుడు దర్భల మీది నుంచి లేవకుండానే చుట్టూ మూగిన జనాన్ని చూసి, "మీరందరూ ఊరుకుంటారేం? రాముడికి చెప్పరేం?" అని అడిగాడు.

"రాముడు తండ్రి ఆజ్ఞ పాలించి తీరాలని పట్టుపడుతున్నప్పుడు చేసేదేముందీ?" అన్నారు వారు.



# 8. చీనా మహాకుడ్యం

ఇది చీనాలో గల అత్యంత ప్రాచీన కట్టడం. ఈ "గోడ" నిడివి 1400 మైళ్ళు; ఎత్తు 20 నుంచి 35 అడుగులు; మందం 10 నుంచి 13 అడుగులు. షీహ్వాంగ్ తీ చక్రవర్తి ఈ గోడను తన రాజ్యపు ఉత్తర సరిహద్దున క్రీ. పూ. 3వ శతాబ్దంలో కట్టించాడు.





# ప్రశ్నోత్తరాలు

1. డి. ప్రేమచంద్, హైదరాబాద్

మీరు ప్రచురించే కథలన్నీ తెలుగులోనే వచ్చునా?

చాలా భాషలలో వస్తాయి.

2. కర్రి సూరారెడ్డి, అనపర్తి

ఫొటో వ్యాఖ్యల పోటీకి మొదటనే రెండు పేజీలలో రెండు ఫోటోలు ప్రచురించిన అర్థము చేసికొనుటకు వీలుగ నుండునుకదా? మొదటనే పెద్ద ఫొటోలు వేయుటలో మీకు అభ్యంతరమేమున్నది?

వ్యాఖ్యలు లేకుండా పెద్ద ఫొటోలు వెయ్యవలిసి వస్తుందన్నదే అభ్యంతరం.

3. తుకారాం, ముస్తఫర్‌పూర

అట్టి (రాముడు, భరద్వాజుడు) వారు మధు మాంసాదులు సేవించిరనిన ఇప్పటి బ్రాహ్మణేతరులు తినకుండుట కేమిహేతువు?

బౌద్ధ జైన మత ప్రభావాల ఫలితంగా మాంసాహార వర్జన దేశంలో అమలు జరిగింది. తాగుడు నింద్యంగా ఎప్పుడూ ఉన్నది. ఇప్పుడది నిషిద్ధంకూడా చాలా చోట్ల అయింది. ఇవి ఆచారాలకు సంబంధించిన విషయాలు.

4. కాటూడ కమలారాణి, బరంపురం

ఉత్పల సత్యనారాయణాచార్యగారి "ఉత్పలమాల" విడుదలయిందని ఈమధ్య పేపర్లో చదివాను. మరి అది ఎప్పుడు మా చేతి కొస్తుంది?

"ఉత్పలమాల" ఆవిష్కరణ మహోత్సవం జరిగింది, కాని పుస్తకం అమ్మకానికి రావటానికి కొద్దికాలం పట్టవచ్చు.

5. కె. సుందర్, మిరజ్

ఏమండి, చందమామగారు! మీ యొక్క సంచాలకుడైన "చక్రపాణి" గారు, "గుండమ్మ కథ" చిత్రము యొక్క నిర్మాతలలో ఒకరైన "చక్రపాణి" గారు ఒకరేనా? లేక వేరువేరునా?

ఒకరే.

6. ఎం. రఘురామరెడ్డి, రామగుండం

అన్నయ్యా, మేము పంపే రచనలు అచ్చుకాకపోతే మా కెంత నష్టమో తెలుసా?

మీరు పంపే రచనల మంచి చెడ్డలు చూడకుండా అచ్చువేస్తే "చందమామ"కూ, పాఠకులకూ ఎంత నష్టమో, ఎంత కష్టమో తెలుసా? అందుకే రచనలు పంపేవారు "చందమామ" పాఠకులకు నచ్చేవిగా చూసి పంపాలి.

7. పంకజ, యేటవాకిలి

అన్నయ్యా, కాకుల సంఖ్య ఎంత యని అక్బరు అడుగగా అరవై వేల అయిదువందల యాభైరెండు కాకులని జవాబిచ్చినాడు కదా, బీర్బల్ పూర్వమే లెక్కవేసి యుంటాడని మా తమ్ముడు, కాదని నేను వాదించు చున్నాము. మీరెవరితో ఏకీభవిస్తారు?

బీర్బల్ జవాబులో గల హాస్యం తమ్ముడికి అర్థం కాలేదు.

8. యిమ్మడి రామమోహనరావు, తెనాలి

అన్నయ్యా, మేము రామతీర్థ కథలు సొంతంగా వ్రాసి పంపవచ్చునా?

నువు సొంతంగా రాస్తే అవి రామమోహన కథలవుతాయిగాని, రామతీర్థ కథలు ఎలా అవుతాయి, తమ్ముడూ? "చందమామ"లో వేస్తున్నవి స్వామి రామతీర్థ చెప్పినవి.

9. ఎ. ప్రభాకరరావు, విజయనగరము

"చందమామ"ను చూచిన వెంటనే ఇతర పుస్తకములపై దృష్టిపోదు. కారణమేమంటారు?

ఇతర పుస్తకాలు ఆకర్షవంతంగా ఉండటానికి యత్నించకపోవటమే.

10. డి. ఎస్. ప్రకాశరావు, మెలుపాక

ఆకాశవాణి శబ్ద తరంగాలు గాలి ఎక్కువగా వీస్తున్నపుడు రేడియోలకు తొందరగా చేరుకొనునా? లేక మామూలుగానే చేరుకొనునా?

ఆకాశవాణి నుంచి వెలువడేవి శబ్దతరంగాలు కావు, రేడియో తరంగాలు. అవి గాలిలో కదిలేవి కావు. అందుచేత గాలి వీచటంతో వాటి కేమీ సంబంధంలేదు. ఆ తరంగాలను రేడియో సెట్టు ధ్వని తరంగాలుగా మార్చుతుంది.

11. కె. రామబ్రహ్మానందరావు, బండార్లంక

భారత చరిత్ర ఇంకా ఎంతవరకు వేసెదరు?

అయిపోయే దాకా.

Photo by P. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

బిచ్చైన గుఱ్ఱం ఎక్కగ...

పంపినవారు:
వి. ఆర్. రెడ్డి, పల్లిప్రోలు

Photo by A. M. Hussain



బహుమతి
పొందిన వ్యాఖ్య

నిచ్చెన కావలయునేమొ ?

పంపినవారు :
వి. ఆర్. రెడ్డి, పల్లప్రోలు

## మనిషీ — దేవుడూ  [రామతీర్థ కథ]

ఒకనా డొక పెద్దమనిషికి పెద్ద జిజ్ఞాస పట్టుకున్నది: మనిషికీ దేవుడికీ తేడా ఏమిటి? ఈ సందేహం తీర్చుకునే ఉద్దేశంతో ఆయన ఒక తత్వవేత్తగారింటికి వెళ్ళాడు.

సమయానికి తత్వవేత్త అయిన గృహస్థు బయటికి వెళ్ళి ఉండటంచేత పెద్దమనిషి చావడిలో కుర్చీలో కూచుని జ్ఞానియొక్క రాకకోసం ఎదురు చూశాడు. కొంతసేపటికి జ్ఞాని రానే వచ్చాడు. పెద్దమనిషి ఆయనను చూడగానే, "అయ్యా, మనిషికీ దేవుడికీ గల తేడా ఏమిటో తమ ద్వారా తెలుసుకుందామని వచ్చాను," అన్నాడు.

జ్ఞాని ఆ ప్రశ్నకు సమాధానం చెప్పక నౌకర్లను పిలిచి, వాళ్ళతో పరుషంగా మాట్లాడుతూ, "ఈ మనిషిని వెంటనే బయిటికి గెంటెయ్యండి," అన్నాడు. పెద్దమనిషి ఇది చూసి బెదిరి, కుర్చీలోనుంచి లేచి, ఎడంగా వచ్చాడు.

జ్ఞాని వెంటనే సౌమ్యంగా ఆయనతో, "ఇదే తేడా. నేను దేవుణ్ణి; మీరు మనిషి. మీరు భయపడి కుర్చీలో నుంచి లేవక నిశ్చలంగా ఉండగలిగితే మీరూ దేవుడే అయి ఉందురు! మీ దేవత్వంలో మీకు నమ్మకంలేక పోబట్టే మీరు మనిషిగా ఉండిపోయారు," అన్నాడు.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1962 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జూలై నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: బచ్చెన గుఱ్ఱం బెక్కగ...

రెండవ ఫోటో: నిచ్చెన కావలయునేమొ?

పంపినవారు: పుచ్చూరు రమణారెడ్డి,

పల్లప్రోలు, నెల్లూరుజిల్లా.

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# అట్టచివరి బొమ్మ

చనిపోయిన వారికి తర్పణాలు వదలినాక పాండవులు, విదుర ధృతరాష్ట్రులతోనూ, స్త్రీజనం తోనూ ఒక నెల పైలపట్టి నగరం వెలపల పట్టశాలలో ఉండిపోయారు. ఆ సమయంలో వ్యాసుడు, నారదుడు, దేవస్థానుడు, కణ్వుడు శిష్యసమేతంగా ధర్మరాజును చూడవచ్చారు. రాజ్యం గెలుచుకున్నందుకు సంతోషించటానికి బదులు, అందరినీ చంపుకున్నందుకూ, ముఖ్యంగా కర్ణుడు తమ అన్న అని తెలియనందుకూ దుఃఖిస్తున్న ధర్మరాజుకు నారదుడు కర్ణుడు పొందిన శాపాలను గురించి వివరంగా చెప్పాడు.

కర్ణుడికి చిన్నతనంలోనే పాండవులపై అసూయ ఉండేది. ధర్మరాజు బుద్ధిశాలి, భీముడు బలశాలి, అర్జునుడు విలువిద్యలో ప్రవీణుడేగాక కృష్ణుడికి మిత్రుడు, నకుల సహదేవులు బుద్ధిమంతులని పేరు పొందినవారు. ఈ అందరిపై గల అసూయ చేత కర్ణుడు దుర్యోధనుణ్ణి ఆశ్రయించాడు, అస్త్రప్రయోగంలో అర్జునుడంత వాడనిపించుకోవాలని అతను ద్రోణుణ్ణి బ్రహ్మాస్త్రం వేడాడు. అది బ్రాహ్మణ క్షత్రియులకు మాత్రమే ఇవ్వవచ్చునని వంక బెట్టి అర్జున పక్షపాతి అయిన ద్రోణుడు నిరాకరించాడు.

అప్పుడు కర్ణుడు పరశురాముడి వద్దకు వెళ్ళి, బ్రాహ్మణుణ్ణని అబద్ధమాడి, ఆయన దగ్గిర శిష్యుడుగా చేరి, ఎన్నో శస్త్రాస్త్రాలు సంపాదించాడు. ఈ సమయంలోనే కర్ణుడు ఒక బ్రాహ్మణుడి హోమధేనువును చంపాడు. ఆ బ్రాహ్మణుడు కోపంతో, "ఓరీ, నీవు యుద్ధ రంగంలో రథ చక్రం కుంగి, నా ఆవు చచ్చినట్టే చస్తావు," అని శాపమిచ్చాడు.

మరి కొంతకాలం శుశ్రూషలు చేసిన మీదట పరశురాముడు కర్ణుడికి బ్రహ్మాస్త్రం యొక్క ప్రయోగ ఉపసంహారాలు చెప్పాడు. ఇది జరిగాక ఒక ఉపవాసదినంనాడు పరశురాముడు కర్ణుడి తొడపై తలపెట్టి నిద్రపోతూండగా ఒక కీటకం వచ్చి కర్ణుడి తొడ తొలచ నారంభించింది. గురువుకు నిద్రాభంగం చెయ్యటం ఇష్టంలేక కర్ణుడు బాధ భరించాడు. తరవాత పరశురాముడు లేచి రక్తప్రవాహాలనూ, కీటకాన్నీ చూసి ఆశ్చర్యపడ్డాడు. అంతలోనే కీటకం మాయమై ఒక రాక్షసుడు కనిపించి, తాను పరశురాముడి తాత చేత శాపం పొంది కీటక మైనట్టూ, పరశురాముడు తనను చూడగానే శాప విముక్తి కలిగినట్టూ చెప్పి వెళ్లిపోయాడు. పరశురాముడికి అనుమానం కలిగి, "ఇంత బాధను సహించిన నీవు బ్రాహ్మణుడవు కావు. నిజం చెప్పు," అన్నాడు. కర్ణుడు భయపడి నిజం చెప్పేశాడు. బ్రహ్మాస్త్రం కర్ణుడికి పనికిరాకుండా పరశురాముడు శాపం పెట్టాడు. ఇన్ని శాపాలూ పొందినా కర్ణుడు మహా వీరుడైనాడు. కళింగరాజైన చిత్రాంగదుడి కుమార్తెను స్వయంవరమప్పుడు దుర్యోధనుడు ఎత్తుకు వస్తుంటే, ఇతర రాజులు అతనిపై యుద్ధానికి రాగా కర్ణుడు వారినందరినీ ఓడించాడు. జరాసంధుడితో గదాయుద్ధం చేసి ఓడించి మాలిని అనే నగరాన్ని పుచ్చుకున్నాడు. ఈ విషయాలన్నీ చెప్పి నారదుడు ధర్మరాజుతో, "కర్ణుడి చావుకు నీవుగాని, అర్జునుడు గాని కారకులనుకోకు. ఆ చావుకు కారణాంతరాలెన్నో ఉన్నాయి," అని ఊరడించాడు.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

రాగిణి సౌందర్య రహస్యం...

'మనోహర చర్మసౌందర్యమునకు అనువైనది లక్స్'




'నాకు నచ్చిన సబ్బుకు, మెచ్చిన రంగులు !'

అన్నది సొగసైన సినీమాతార రాగిణి.

హిందుస్తాన్ లీవర్ ఉత్పత్తి

LTS.112-X29 TL




## లిటిల్స్
## ఓరియంటల్ బామ్

జలుబు, తలనొప్పి మొదలగు
బాధల నివారిణి




## జర్మెక్స్

నరుకులకు, గాయములకు, కాల్పులకు
పెట్టింది పేరు




లిటిల్స్ ఓరియంటల్
బామ్ అండ్
ఫార్మకాస్యూటికల్స్ లి.,
మదరాసు - 2.



## మీ శిరోజాలు అంత మనోహరంగావుండవలెనని మీ కోరిక!

ఇటు తిరిగి ఒక్క-
చూపు — మీ చెప్పలాని
మరచినవి, కారణం!
ఒత్తుగా పెరయుచుంచే మనోహర
మైన ఆమె శిరోజాలు —
అప్పుడు మీ శిరోజాలు అంత
మనోహరంగా వున్నవని
తెలియు చుండుటచేత మీ
హృదయం ఉల్లాసంతో
ఉప్పొంగదా! అధిక
గుణవంతమైన పదార్థా
లతో గూడియున్న
ప్రశంసనీయ పరిమళం
గల 'కేష' మనోహర
మైన శిరోజాలు ఒత్తుగా
పెరుగునట్లుచేసి మీ
శిరోజాలకు క్రొత్త
దక్కదనము గలిగిం
చును — మీరుఆశించే
క్రొత్త దక్కదనము!

**మీ కేశ పోషణ పథకము
నేడే ప్రారంభించండి**




రోమ గృహమునుండి
మరియొక శ్రేష్ఠమైన ఉత్పత్తి

సోల్ ఏజెంట్లు:
ఎమ్. ఎమ్. ఖంభట్ వాలా, అహమదాబాద్

ఏజెంట్లు:
ఏ. వరోత్తమ్ అండ్ కో., బొంబాయి - 2

TBL

బట్టలను
ఎంతో
శుభ్రముగా
ఉతుకుకొనుటకు



నిరాల



పోయిన సంవత్సరం

నా **హెర్క్యులీస్**

సైకిలుకు చేసింది ఒక్క

ఓవర్‌హాలింగ్ మాత్రమే

— అంటున్నాడు మహమ్మద్ ఇస్మాయిల్

ఇందుకోసం అతను మూడు రూపాయలకంటె ఎక్కువ ఖర్చుపెట్టలేదు.

ఈ రోజుల్లో తయారయ్యే సైకిళ్లలో హెర్క్యులిస్ అత్యుత్తమమైనది. ఇండియాలోనే చాలా పెద్దదీ, అన్ని హంగులూ కలిగిన కర్మాగారంలో ఇది తయారుచేయబడుతోంది. ఇందులోని ప్రతి భాగమూ ఖచ్చితంగాను సక్రమంగానూ వుంటుంది. అందువల్ల కొంచెం జాగ్రత్తతోనే హెర్క్యులిస్‌ను చాలాకాలం వాడుకోవచ్చును.

# హెర్క్యులీస్

ఇది వట్టి సైకిలు కాదు

జీవితకాలపు నేస్తం



నిర్మాతలు: టి. ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా, అంబత్తూరు — మదరాసు

JWT/TIC/H 1584a

